# అంతా నాటకమే

(నాటిక)



కవిసమ్రాట్

విశ్వనాథ సత్యనారాయణ, M. A



లలితకళాపరిషత్తు,
మచిలీపట్నం.

B

# అంతా నాటకమే

(లలితకళాపరిషత్తు ద్వితీయ ప్రచురణ)

తొలిముద్రణ: జనవరి 1954:

మూల్యం ఒక రూపాయి.







కృష్ణా స్వదేశీప్రెస్,
బందరు.

# అంతా నాటకమే

## [నాటిక]

*

## పూర్వాంకము

( కేశవదాసు-రంగమ్మ-రాము ప్రవేశం )

కేశవ:- నాపేరు కేశవదాసు, నేను భర్తని. నీ పేరు రంగమ్మ, నీవు భార్యవు.

రంగమ్మ:- ఈ కుర్రవాడిపేరు రాము. ఇతను రంగమ్మ మరిది.

కేశవ:- కాదు, కేశవదాసు తమ్ముడు.

రంగమ్మ:- ఇంట్లో రామయ్యగారున్నారు. ముసలాయన మంచములోపడి. ఆయన రంగమ్మ మామగారు. కేశవదాసుగారి తండ్రి.

కేశవ:- రెండూ నువ్వే చెప్పేస్తే ఎట్లా? చెపితే చెప్పుకో. నేను చెప్పేవి చాలావున్నై. కేశవదాసుకి నెలకు పాతిక రూపాయలజీతం. తిండికి చాలదు. వాడి పెళ్ళాం ఇంగ్లీషు చదువుకుంది. ఎప్పుడో మగని వదలి లేచిపోతుంది.

రంగమ్మ:- కేశవదాసుగారున్నారే! వారికీ పాతిక రూపాయాల ఉద్యోగం కూడా ఎప్పుడో రామార్పణం అవుతుంది.

కేశవ:- అప్పుడు నీవు అసలే వుండవు నాయింట్లో.

రంగమ్మ:- ఈ ఇల్లే మీదిగాదు, ఆ శేషగిరిరావుగారిది. వారి దయవల్ల ఉండనిస్తున్నారు.

కేశవ:- అతని పెండ్లాం దయవల్ల రోజూ పోట్లాటే.

రంగమ్మ:-అదే మీదగ్గరవుంది. ఇంకా అరవండి మీసొమ్మేమి పోయింది. ఆవిడని సర్దుకోలేక నాదుంప తెగుతుంది.

కేశవ:- దుంపకాదు తాడు.

రంగమ్మ :- అబ్బా మీది నోరుకాదండి !

కేశవ:- అను అను. ఇంగ్లీషు చదువుకున్న ఆడవాళ్ళు సంసారాలు చేస్తారా! మొగుణ్ణి గౌరవిస్తారా!

రంగమ్మ:- దానికేమీ భయములేదు. మొగుడి గొప్పేమిటి, మగవాళ్ళను ఎందుకు గౌరవించాలి,అని ఉపన్యాసాలిస్తారేగాని వాళ్ళ మొగుళ్ళను వాళ్ళు వదలిపెట్టి యెవళ్ళూ వెళ్ళరు. ఇతరులను పాడుచెయ్యటానికే తమ తెలివిని ఉపయోగిస్తారు.

కేశవ:- ఇంతకూ నీవు మంచిదాన్నంటావు.

రంగమ్మ:- లేకపోతే మీతో సంసారం చేసేదాన్నే, రోజుకు మూడువ్యోగాలు పోగొట్టుకుంటూ.

కేశవ:- ఇచ్చేవాడెవడే పోగొట్టుకునేందుకు.

రంగమ్మ:- ఎవడో తలకు మాసినవాడు.

కేశవ:- మీనాన్నవంటివాడు.

రాము:- అంటే వదినెగూడా ఉద్యోగం వంటిదే నన్నమాట.

రంగ:- నీకు గూడా తెలిసిందన్నమాట మీఅన్నయ్య తరహా.

కేశవ:- నామీదపెట్టకు. ఈకాలం అట్లాఉంది. నే నింగ్లీషు చదువుకుని పాశ్చాత్యపు పోకిళ్లు పోకపోయినా కాలం ముద్ర నామీదాఉంది.

రంగ:- ఆయన యెవరో పెద్ద సంస్కృత పండితుడు కూడా తెలుగుభాష ద్రవిడభాషాకుటుంబి అని వ్రాసినట్లుగా.

కేశవ:- మాటలేనా, ఈ పూట వంటచెయ్యటం ఏమైనా ఉందా ?

రంగ:- ఇంట్లో బియ్యం లేకుండా వంట ఎట్లా చెయ్యటం ? చుట్టపట్ల యెవ్వరూ ఇక అప్పిచ్చేటట్లు లేరు.

కేశవ:- ఎక్కడినుంచి అయినా ఒకపాతిక వేలు వస్తే బాగుండును.

రంగ:- మీకింగ్లీషు అయినా రాదాయెను క్రొసుపద్దు పజిల్సు అయినా వేసేందుకు.

కేశవ:- నీకు వచ్చుగా వెయ్యరాదు ?

రంగ:- పంపించేందుకు అర్ధరూపాయి యేదీ?

కేశవ:-ఆ రెండిళ్ల తరువాత ఉండే ఇల్లు,ఆయనకి చూడు మంచి ఉద్యోగం వచ్చింది.

రంగ:- నన్నట్లా చేయమంటారా!

కేశవ:- అన్నానికి లేకపోతే! నీతియేమిటి? దేవుడేమిటి ?

రంగ:- అబ్బో! మనమీద కాలపుముద్ర చాలావుంది.

కేశవ:- నీకేమీ భయమక్కరలేదు. లోకానికి మాత్రం పూర్తిగా విశ్వాసం ఉండంటావా! సగంమోసం. మొన్న

పార్లమెంటులో చూడు, అందరూ మన మతానికి వ్యతిరేకం. సంఘసంస్కారం కావాలనేవాళ్లే. హిందూకోడు బిల్లుకు అనుకూలమే. ఆ అంబేద్కరు సీతారాములను గురించి అసభ్యంగా మాట్లాడట. అందరికీ కోపం వచ్చింది. ఆభాగం మినహాయిస్తానన్నాడు స్పీకరు. మాకు మతం లేదంటారు. గాంధీగారి అస్థికలే కాదు బూడిదకూడా నదుల్లో కలిపారు. ఆయనకు సమాధికట్టి క్రైస్తవులవలె పువ్వులువేస్తూ ఉంటారు. ఇదంతా కలగూరగంప. రాజానుమతో ధర్మః. మనమూ అల్లాగే ఉందాం.

రంగ:- ఇక్కడ రాజులేండే?

కేశ:- ఓహో ఇది ప్రజాస్వామికమనా నీ ఉద్దేశం! రాజులేదని పేరు. రాజేనయం. ఒకడు డిక్టేటరు, ఒకడు ప్రెసిడెంటు, ఒకడు ప్రైమిమినిస్టరు. ఇవన్నీ దొంగపేర్లు. వీళ్ళందరూ రాజులే. రాజులకన్న కనాకష్టం. రాజులు ఘోరంగా పాలిస్తారని వాళ్ళను తీసివెయ్యటం. ప్రజలలో ఉద్యమాలు లేవతీయటం. తమరిని ప్రజలు ఎన్నుకున్నారనటం. వీరు వారికన్న నిరంకుశులు. ఈ ప్రజలకు బుద్ధిలేదు. ఒక చమత్కారం చూడు. హైదరాబాదులో నైజాం వస్తూంటే ట్రాఫిక్కు ఆపేవాళ్ళు. అది పనికిరాదని ఆందోళనచేసారు. ఆపారు. నిన్న మినిస్టరువస్తే మన వూళ్ళో యేంచేశారు? ప్రజ ఘోషించారు.

రంగ:- ఇట్లా ఉండకూడదంటారా!

కేశవ:- నేనేమీ అనను. రాజానుమతో ధర్మః అంటాను. వీళ్ళందరు రాజు లంటాను. పేరుమాత్రం మార్చుకున్నా రంటాను.

రంగ:- ఈ ఉపన్యాసాలు బాగానే ఉన్నాయిగాని పోయి బియ్యం తీసుకురండి.

కేశవ:_బియ్యం వాటి అంతట అవి రావు. డబ్బుపెడితే వస్తవి. ఆ డబ్బులేదు. ఎవరినడిగినా యివ్వరు. నీకు చేటపప్పు ఎట్లా పుట్టటంలేదో నాకు చేబదులు అట్లా పుట్టటంలేదు.

రంగ:- మరేం చెయ్యాలి !

కేశవ:- మనం చేసేది వేమీలేదు. భగవంతుడు చెయ్యాలి.

రంగ:- వాడుంటే మనం ఇల్లా ఎందుకుంటాం?

కేశవ:- నీదుంపతెగ! ఆమాట అనకు. మనకు ధనం రానీయి తరువాత ఆదేవుడు లేడంటాం.

రంగ:- ఇప్పుడున్నాడు అప్పుడు లేడా!

కేశవ:_ సరిగ్గా అంతే? అవసరం అయినపుడుంటాడు. హరిజనుల దేవాలయ ప్రివేశానికి ఉన్నాడు. ప్రిచారానికి లేడు. దేవుడిగుళ్లో రాయిదేవుడా అనటంలేదా! అదీ తంతు.

రంగ:_ అయితే యిప్పుడు దేవుడున్నాడనే అందాం.

రాము:- అయితే డబ్బు వచ్చిందన్నమాటే.

# అంకము 1

[గాంధిహోటల్ అను బల్ల కట్టివుంటుంది. ఎదురుగా ఒకాయన కుర్చీలో కూర్చునివుంటాడు దనుకుముందర.]

బిచ్చగాడు:-

రెండుచేతుల కుమ్మరించుకుంటున్నాడు
దండుగో పండగో తనకు తెలియదు నేడు
బండెక్కి వెళతాడులే,- కొద్దిలో బయటపడి పోతాడులే!

సుదర్శనం:- నీకు కాదట్రా చెప్పేది. ముండిగాడిదకొడకా!
ఇది కాఫీహోటలు. ఇళ్ళదగ్గరకు పోయి అడుక్కో!
బిచ్చ:- దొరా! గాంధీ బిచ్చగాణ్ణి. మీది గాంధిహోటలు.
మీరు పెట్టకపోతే యెవరుపెడుతారు ?
సుదర్శం:- నీవు గాంధీబిచ్చగాడివేం? ఆగు పెట్టిస్తా!
బిచ్చ:- (పాడును)

ఇది యేమిలోకమో యెగిరిపడిపోతోంది
బ్రదికినన్నాళ్ళునూ పగులపడిపోతోంది
శాశ్వతమ్మంటారురా,- ఎప్పటికి చావె లేదంటారురా!

సుదర్శ:- ఇవి గాంధీపాటలా యేమిరా!
బిచ్చ:- అవును బాబూ! ఆయనెవరో వ్రాశాడు గాంధీ తత్వాలని. అందులోపాట.
సుదర్శ:- ఎవడావ్రాసిన లంజకొడుకు?

బిచ్చ:- కేశవదాసుగారండి.
సుదర్శ:- వాడా! ఇప్పుడిక్కడికి వస్తాడుండు.
బిచ్చ:- అయ్యా, రెండు ఇడ్లి యిప్పించండి. ఆకలిగావుంది. తిని పోతాను.
సుదర్శ:- ఇడ్లి ఎందుకు, ఆగు. వాడికీ నీకూ కలిపే పెసరట్లు వేస్తాం.

[కేశవదాసు ప్రవేశం]

కేశవ:- నమస్కారమండి. ఎందుకో కబురంపించారు.
సుదర్శ:- మాకు నమస్కారా లెందుకులే, లోపలికిపదం వస్తాం.
కేశవ:- మా నాయనగారికి జబ్బుగావుంది. తొందరగా వెళదామని వచ్చాను. దయచేసి యిక్కడే చెప్పండి.
సుదర్శ:- ఇక్కడే చెప్పమంటావా! ఒరేయి! అందరినీ బయటికి పంపించి వీధితలుపు వేసిరా.
రంగడు:- (వస్తాడువలె ఉంటాడు - ప్రవేశించి) వేశాను.
సుదర్శ:- వీడు పాడుతున్నాడు. ఆ పాటలు నీవు వ్రాసినవేనా?
కేశవ:- చిత్తం.
సుదర్శ:- ఆపాటలు నామీద వ్రాసినవేగా?
కేశవ:- అదేమిటి? మీమీద వ్రాస్తానా? మీస్కూలులో నేను మేస్టరుచేస్తూ మీరంటే అంత కృతఘ్నుంగా ఉంటానా? నాది గంపెడంత సంసారం. మానాయనగారు రిటైరుఅయినారు. దీర్ఘవ్యాధిలో పడ్డారు. మీదయవల్ల

నెలకి పాతిక రూపాయీలైనా వస్తున్నవి. లేకపోతే మే మేమి కావాలి!

సుదర్శ:- నీకు తలపొగరెక్కింది దింపుతా.

కేశవ:- అయ్యా మేమూ ఏదో మర్యాదగానే బ్రతుకుతు న్నాము. తమరు అంతమాట అనటం న్యాయంకాదు. పైగా మిమ్ములను ఆశ్రయించుకు బ్రతుకుతున్నాను. నా వల్ల ఏం తప్పుందో చెప్పండి.

సుదర్శ:- ఒరేయి! రంగడు! వీణ్ణి తీసికెళ్ళి తప్పేమిటో చెప్పా లిట. చెప్పిరా!

రంగడు :-రావయ్యా చెపుతాను.

సుదర్శ:- ఫో! (కేశవదాసు నెమ్మదిగా వెళ్లును.)

బిచ్చ:- అయ్యా నేను వెళతాను.

సుదర్శ:- అతన్ని రానియ్యి నీవుకూడా లోపలికి వెళ్లుదువు గాని. ఈ లోపుగా ఇంకో పాట పాడు.

బిచ్చగాడు :-

ఎంత చేసినవారి కంత వ్రాసియున్న
దింతలో జరుగదని యెగసిపాటేలా
అంత దేవుడులేడటంచు నమ్మకమైన
కొంత న్యాయమ్మైనకూలద్రోయదురా

సుదర్శ:- ఇదీ గాంధితత్వమేనటరా!

బిచ్చ:- చిత్తం బాబూ!

సుదర్శ:- కేశవదాసు బయటికి వస్తాడు. అడుగు.

[ కేశవదాసు కన్నీళ్ళతో బాధపడుతూ వస్తాడు. జుట్టు చెరిగి ఉంది. చొక్కా చిరిగివుంది. ఒళ్ళంతా మన్నయింది. ]

కేశవ:- ఏమయ్యా! ఇంటికి పిలిచి కొట్టిస్తావా? నీవు బాగు పడేవాడవేనా? దేశోద్ధారకుడనని పేరుపెట్టుకొని చేయించే పనులివా? నిన్ను నే నేమన్నాను. నీవు మనిషివా! పశువవా!

రంగ:-మళ్ళీ శాస్తి జరుగుతుంది.

కేశవ:- ఏం చేస్తావురా! మహా అయితే చంపివేస్తావు.. రాజ్యము గ్రుడ్డిముండ ఏలుతుందనుకొన్నావా? ఇప్పుడే పోయి పోలీసు రిపోర్టు ఇస్తాను. నీ దుంప తెంచుతాను. పేదవాళ్ళంటే నీకంత లోకువగాఉందా! గాంధిపేరు పెట్టుకొని నీవు చేసేపనులివ్వా!

సుద:- నోరుమూసుకు వెళతావా వెళ్ళవా? బ్రతకతలచు కుంటే వెళ్లు.

కేశవ:- నేను బ్రతకదలుచుకోలేను. చంపివెయ్యి.

బిచ్చ:- ఏమిటి బాబూ!

కేశవ:-ఏమిటా! ఆ లంజకొడుకున్నాడే కరిమొద్దల్లే, వాడు నన్నింట్లోకి తీసుకుపోయి చచ్చేటట్లు కొట్టాడు.

రంగడు:- లంజకొడుకా? (వీపుమీద కొట్టును)

కేశవ:- (బాధపడుచు) నిన్ను లంజకొడుకంటే తప్పా! (సుదర్శనాన్ని చూపించి) వాడు చేయమంటే చేసేవాడివి నీవు ఇల్లాలి కొడుకువురా! ఇల్లాలి కొడుకు తనకుతోచిన పని చేస్తాడు. లంజకొడుకు గడ్డికోసం ఇతరులు చేయు మన్నపని చేస్తాడు. నేను నిన్నేమీ అనలేదు. నీకూ

నాకూ విరోధం లేదు. వాడు కొట్టమంటే కొట్టినదేగా నువ్వు ?

రంగడు:- అయ్యగారిని వాడంటావా నువ్వు (కొట్టవచ్చును).

కేశవ:- వాడు నన్ను కొట్టించవచ్చును గాని నేను వాడనకూడదు. నేను ఏమండీ ఏమండీ అంటూంటే వాడి వెధవ స్కూలులో నాకు పాతికరూపాయీ లిస్తున్నాడని నన్ను నువ్వు నువ్వనవచ్చునేం ? నేను చదువుకున్న వాడిని, నీవు శుద్ధమొద్దు. పొట్టపొడి స్తే అక్షరంముక్క లేదు. డబ్బున్నది గదా అని స్కూలుపెట్టాడు. వీడు మా మీద అధికారా ! ఇష్టమువచ్చినవాడికి ఉద్యోగం ఇస్తాడు. బి. ఏ. లు, ఎం. ఏ. లు ప్యాసయినవాళ్లు వీణ్ణి ఏమండీ అనాలి. వీడు వాళ్ళందరినీ నువ్వంటాడు.

సుద:- ఒరీ రంగడూ, వీణ్ణి బయటకు గెంటివెయ్యి.

కేశ:- నే నిక్కడనుంచి వెళ్ళను. నే నింగ్లీషు చదువుకో లేదు. ఇల్లాంటి దుర్మార్గాలు సహించేందుకు నేను తెలుగు చదువు కున్నాను. మాతృభాష చదువు కున్నాను. వాణ్ణి నన్ను గొటమను. దెబ్బలు తిన్నా సరే కొరుకుతాను. రక్కుతాను. నేలపడి జారుతాను వెళ్ళను. ఇక్కడే ఉంటాను. వచ్చినవాళ్ళందరికీ నీ రహస్యం చెప్తాను. నీ బైసుకడుగుతాను. నన్ను కొట్టిస్తావా ! కొరివిపెట్టి తలగోక్కున్నావన్నమాటే !

బిచ్చు:- అయ్యా ! మీరు మహాప్రభువులు. దాసుగారు గాంధిగారంటివాడు. ఆయనను కొడతారా బాబూ !

సుద:- నోరు ముయ్యి. నీకూ ఆపనే జరుగుతుంది.

కేశ:- ఎంతమందికి చేస్తావేమిటి ఆ పని. తాడితన్నినవాడి తలతన్నేవా డుంటాడు. అంత మిడిసి పడకు. బిచ్చ గాళ్లనుకూడా కొట్టిస్తాడట, దాత!

రంగ:- నోరు మూస్తావా! ముయ్యవా! ఒక్క దెబ్బతో చస్తావు.

కేశ:- ఒరేయి! అదరకు. ఈ వూళ్ళో నీ మొగు డున్నాడు. అప్పలస్వామి. అతన్ని నేను బాగా ఎఱుగుదును. నిన్ను వదలిపెట్టా ననుకోకు. నా దగ్గర డబ్బు లేదుగాని యీ వూళ్లో మర్యాదగానే బ్రతుకుతున్నాను. సుదర్శనం అండ నీకు ఇక్కడే పనికి వస్తుంది. ఊళ్లో పనికి రాదు.

రంగ:- (మాటాడకుండ వెళ్ళిపోతాడు.)

బిచ్చ:- (నవ్వుతూ) చూచావా బాబూ! వాడి పని అంతలో ఉంది.

కేశవ:- మరి యిట్లాంటి వెధవ లేమిటి అనుకున్నావు. ఈ సుదర్శనం మాత్రిం ఏమిటనుకున్నావు. అందరికీ గడ్డి తినిపిస్తున్నాడు. ఇల్లా ఆడుతున్నాడు. ఇప్పుడు నేను వెళ్లి పోలీసు రిపోర్టు ఇస్తాననుకో. ఏమీ లాభం లేదు. దావా వేస్తాననుకో. అంతకంటె లాభం లేదు. ఈ ప్లీడర్ల చుట్టూ కోర్టుల చుట్టూ తిరగాలి. పైగా చివరకి సాక్ష్యం లేదని కొట్టివేస్తారు. ఈ రాజ్యంలో మనిసిని చంపినా ఫరవాలేదు. కోర్టువారు ఎంత సేపటికీ తప్పు

చేసినవాడి నేపు ఉంటారు. దీనిపేరు ఇంగ్లీషు లా. ఒక నిర్దోషిని శిక్షించటం కన్న పదిమంది ఘోరాల్ని చేసిన వాళ్లని వదలటమే మంచిది అన్నది వారి బాగా రపు సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని పట్టే లోకంలో దుర్మార్గాలెక్కువగా ఉన్నవి.

సుద:- నీ యీ వాగుడే దీనికి కారణం. విమర్శలెక్కువరా నీకు. తినటానికి తిండిలేదు. అదురుడెక్కువ.

కేశ:- నన్ను ఏరా అంటావా! అంటావు. నాకు తినటానికి అన్నంలేదుగా! నీకుంది. అందుచేత నిన్ను ఏమండీ అనాలి. నీవు కొట్టిస్తావు. దెబ్బలు తినాలి. నీవు ఉద్యోగం తీసివేస్తావు. చావాలి. తొందరపడకు. ముందరఉన్నది ముసుళ్లపండుగ.

సుద:- నోరుమూసుకుని వెడతావా, నేనుకూడా చెయ్యి చేసుకోవాలా!

కేశ:- ఊరివారి బిడ్డని రాజుబిడ్డ కొడితే రాజుగారి బిడ్డను దేవుడిబిడ్డ కొట్టాడట.

సుద:- మాటలునేర్చావు. అంతే. నీకు ఆ నోరుకట్టాలి అంటే తడి తగలాలి. నాకు పనిచెడుతున్నది. మళ్ళీ చూస్తాలే నీ పని, వెళ్ళు.

కేశ:- కాఫీహోటలు బేరం పోతున్నదా! ఎవరో వస్తారుగా రానియ్యి, వాళ్ళతో చెప్పే పోతా.

బిచ్చ:- బాబూ! వీధితలుపు వేశారు, ఎవరూ రావటానికి వీలులేకుండా.

కేశ:- నీవు తియ్యి.

సుద:- తియ్యమను. ప్రాణాలుతీస్తాను.

కేశ:- తియ్యరా! ఏంచేస్తాడో చూస్తాను. నీ మీదకువస్తే నేనడ్డం తగులుతాను. కొడితే నన్ను కొడుతాడు నీవు తలుపుతీసి దారివెంట వెళ్ళేవాళ్ళను పిలు.

(బిచ్చగాడు వెళ్లును)

కేశ:- బిచ్చగాడిమీదికి వెళ్ళవేం ?

సుద:- ఎవరో వస్తారంటివిగా రానీయి! నీవేంచెపుతావో చూస్తాను.

(నాగయ్య ప్రవేశించును)

నాగయ్య:- సుదర్శనంగారూ, నమస్కారం. కేశవదాసా! అదేమిటి అట్లావున్నావు ?

కేశ:- నేను ఈయనపెట్టాడే బద్మాష్ పాఠశాల. అందులో మేస్టరునుగా. నేను ఈయన బ్లాకు మార్కెటీరు అన్నానట. ఈ హోటలులోఉంటాడు రంగడని, రౌడీ, వాడిచేత నన్ను కొట్టించాడు.

సుద:- ఛీ నోరుముయ్యి. అబద్ధాలు చెప్పకు. చూడండి నాగయ్యగారూ! ఈయన తండ్రికి జబ్బుగావుంటట. ఇదివరకే రెండు నెలలజీతం అడ్వాన్సు ఇచ్చాను. ఇంకా పది రూపాయిలు కావాలంటాడు. ఇవ్వనన్నాను. చస్తున్నానని యేడుస్తూ తల చెరుపుకుని చొక్కా చించుకుని

నానాగోలా చేస్తున్నాడు. వెళ్ళమంటే వెళ్ళడు. ఎంత సేపటినుట్టి వెళ్ళమంటున్నాను నిన్ను ?

నాగయ్య:- అదేమిటి కేశవదాసూ! సుదర్శనంగారు అల్లాంటి పనులు చేస్తారా! ఏదైనా చెపితే నమ్మవద్దూ! నీవు కవీశ్వరుడవు. ఇల్లాంటి మాటలా చెప్పేది ?

కేశవ:- అవును, నమ్మేటట్లుగా చెప్పాలి. ఎల్లా చెప్పటం ? డబ్బుండాలి. ఉంటే నమ్ముతారు. నా దగ్గర డబ్బు లేదుగా. నేను దరిద్రుణ్ణి.

సుద:- ఒరేయి, నాగయ్యగారు వచ్చారు. వారికి మంచి పెసరట్టు అచ్చంగా నతితో వేసిపెట్టు.

కేశవ:- వీడు అచ్చంగా నేతితో వేస్తాడు కొందరికి డాల్డా; కొందరికి వైటాయిల్. నాకు వేరే మోస్తరు. అందరికీ తలో రకం పెసరట్టూను.

(నాగయ్య లోనికి వెళతాడు.)

కేశవ:- (కూర్చుండి) సుదర్శనంగారూ! ఒక యాభై రూపాయీలు ఇప్పించండి.

సుద:- యాభై లేవు. పాతికైతే తీసుకు వెళ్ళు.

కేశవ:- యాభై లేవా! కావలిస్తే వంద వస్తవి.

(గిరిధర రావు ప్రవేశించును)

కేశవ:- ఎవరండి వీరు?

గిరి:- నేను హార్డింగు ఇన్‌స్పెక్టరును. సుదర్శనంగారూ, మీ మిల్లుదగ్గరకు వెళ్ళాను. 6 వేల బస్తా ధాన్యం నిలవ ఉంది. రిపోర్టు చేస్తున్నాను.

సుద:- చేసుకో ! మా మిల్లులో ఒక్క గింజ లేదు.

కేశ:- అంటే తనిఖీకి వచ్చేటప్పటికి అక్కడ బస్తా ఉండదన్న మాట.

గిరి:-అట్లా వీలులేదు. వెంటనే వెళ్ళి తాళాలు వేస్తాను.

కేశ:-సుదర్శనంగారికి నీకన్న బాగా తాళంవెయ్యటం చేతనవు.

సుద:- నీవు కొత్తగా వచ్చావా ! ఉద్యోగానికి.

గిరి:- అవును.

సుద:- నా సంగతి నీకు తెలియదు.

కేశ:- తెలియకు ? ఇల్లా చెయ్యకు. ఆన్‌డ్యూటీ మొలెస్టు చేయి. ఒక ఆరు నెలలు వెళ్ళి రావచ్చు.

సుద:- (బల్ల తెరచి) ఈ వంద రూపాయలు తీసుకువెళ్ళండి.

గిరి:- నే నల్లాంటివాణ్ణి కాను. మీతో చెప్పి చేద్దామని వచ్చాను. మీరేం చేసుకున్నా సరే నా డ్యూటీ నేను చేస్తాను.

సుద:- కుర్రకాకి కేమి తెలుసురా ఉండేలు దెబ్బ అని వందరూపాయిలు నా మాటవిని తీసుకెళ్ళు. చివరకు దీనికికూడా చెడిపోతావు.

గిరి:- మీవంటివాళ్ల మూలాగానే దేశం ఇల్లావుంది. మీ డబ్బు నాకక్కరలేదు. మీ వంటి వాళ్ళు పదిమంది జైలుకివెళితే కాని బుద్ధిరాదు.

కేశవ:- జైలులోకి వెళ్ళటం కాదు. పబ్లికుగా బజారులో కొరడాలతో కొట్టాలి. దానికి ఆ మహామంత్రే ఒప్పుకోలేదు.

గిరి:- ఈయన యెవరు ?

సుద:- కాంగ్రిసు పిచ్చివాడు. మాకూ ఆయనకూ స్నేహం లెండి. ఎప్పుడూ అల్లాగే మాట్లాడుతాడు.

కేశవ:- మీ పేరేమిటండి ?

గిరి:- గిరిధరరావు.

కేశవ:- నామాటవిని ఆ వందరూపాయిలు తీసుకువెళ్ళండి. ఇంతకుముందు యాభై రూపాయిలే లేవన్నావు గదయ్యా సుదర్శనం.

గిరి:- నేను దమ్మిడీ పుచ్చుకోను. మీ మీద కేసుపెట్టే మాట నిజం.

(వెళ్ళిపోవును)

సుద:- అబ్బాయి! ఈమాటవిను. నీకు పెళ్ళయిందా !

గిరి:- ఆ! ఇద్దరుపిల్లలు కూడాను.

సుద:- మీకేమయినా పొలం వుందా ?

గిరి:- లేదు.

సుద:- నీకు జీతమెంత?

గిరి:- ఎందుకవన్నీను, డెబ్బది రెండున్నర వస్తుంది.

సుద:- మీ సంసారంలో ఎంత మంది వున్నారు ?

గిరి:- పదిమంది మున్నాము. మా అమ్మగారు, నాన్నగారు, ఇద్దరు చెల్లెళ్లు, మేనల్లుడు, తమ్ముడొకడు.

సుద:- చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళయినవా !

గిరి:- కాలేదు.

సుద:- అందుకనే వందరూపాయిలు తీసుకువెళ్ళు.

గిరి:- నన్ను లంచం పుచ్చుకోమంటారా ! రిపోర్టులో ఆ సంగతికూడా వ్రాస్తాను.

సుద:- వంద చాలదంటావా ! ఇదివరకినస్పెక్టర్లు కింతకూడా యివ్వలేదు. చెల్లెళ్ళకు పెళ్ళికూడా చెయ్యాలి పాపం నువ్వు. ఈ నూటయాభై తీసుకువెళ్ళు.

గిరి:- నూటయాభై కాదుగదా ! వెయ్యిరూపాయిలిచ్చినా పుచ్చుకోను. నేను గడ్డి తినను. అందరూ మీవంటి వాళ్లే ఉండరు.

(వెళ్ళబోవును.)

సుద:- అబ్బాయి, చెడిపోతావు చెపుతున్నా విను.

గిరి:- ఎవడో లుచ్ఛాపుచ్చుకోవాలి లంచం. దేశం మలమల మాడిపోతూంటే ఆరువేల బస్తా నిలవవేసి లంచం ఇస్తావా ! ఛీ !

కేశవ:- గిరిధరరావుగారూ ! ఈ ఆరువేలబస్తా గవర్నమెంటు స్వాధీనం చేసుకొని పేదవాళ్ళకిస్తారంటారా! అవి దక్షిణాదికి వెళతయ్యో ! ఉత్తరాదికి వెళతయ్యో ! అసలు స్వాధీనమయితేగా!

సుద:- ఈ నూటయాభైకన్న దమ్మిడీ యివ్వను. నా మాట విని తీసుకో. వెళ్ళిపోతావా వెళ్ళిపో ! రిపోర్టు వ్రాస్తావా

వాస్తాయి ! తరువాత నీ పని యేమవుతుందో నీకే తెలుస్తుంది.

నాగయ్య:- (లోపలినుండి వచ్చి) ఇదిగోనండి బిల్లు రూపాయి న్నర (జేబులోనుండి డబ్బు తీయబోతాడు).

సుద:- మీరు డబ్బివ్వటమేమిటి ? ఎవడురా లోపల ? నాగయ్యగారికి బిల్లుయిచ్చారా ! ఎవరికివ్వాలో యెవరి కివ్వకూడదో తెలియదూ ? పశువుల్లారా ! నాగయ్య గారూ ! మీరు డబ్బివ్వటమేమిటి ? పదండి. పదండి.

నాగయ్య:- నాకు మీవల్ల చాలా ఉపకారం కావాలి. ఇలాంటి చిన్నవి కావు.

సుద:- దానికదే. దీనికిదే. అది నేను కాదన్నానా ?

కేశ:- నాగయ్యా ! యేమిటా పని ?

నాగ:- నేను ఎలెక్షనుకు నుంచుంటున్నాను. అంతా సుదర్శ నంగారి చేతిలో వుంది.

కేశ:- సుదర్శనంగారి చేయి అంతా సుదర్శనమే. సరేగాని నాగయ్యా ! నన్నాయన కొట్టించాడంటే ఆయన ఓట్లి ప్పిస్తాడన్న ఆశతోనే న్యాయం చెప్పలేక పోయినావుగదా రేపు నీవు ఎసెంబ్లీలోకి వెళ్ళి న్యాయం చేస్తావంటావా ?

నాగ:- తెలుగు పండితులకు గొప్ప ఉద్యోగాలు ఎందు కివ్వరు, ఇందుకనే !

కేశ:- ఎందుకని ?

నాగ:- ఎందుకనా! అక్కడ మనమేం చెయ్యక్కర్లేదు. పార్టీ నాయకులు చేస్తారు అదంతా. మేమూరకే చేయి యెత్తటమే.

కేశ:- నిజం చెప్పావు. మా అమ్మమ్మ ఆయుర్దాయంకూడా పోసుకు బ్రతుకు. అంత కష్టమేమీ లేదు. ఆవిడ చచ్చి పోయిందిలే!

నాగ:- అయితే న్యాయం చెప్పి పని చెడగొట్టుకోమంటావా? అలాంటివాళ్ళే ఈ లోకంలో ఎందుకూ పనికిరాకపోయేది.

కేశవ:- గిరిధరరావుగారూ! వింటున్నారా! రేపు ఈయన ఎసెంబ్లీకి వెళతాడు. అదీ బాగుపడే లక్షణం. ఆ నూట యాభై రూపాయీలు తీసుకొని వెళ్ళండి.

నాగయ్య:- నూటయాభై రూపాయీ లేమిటి.

కేశవ:- ఏమీలేదు. ఇప్పుడు రూపాయిన్నర వంటిదే. ఈయన హోర్డింగు ఇన్స్పెక్టరు. సుదర్శనంగారి మిల్లులో 6 వేల బస్తా నిలవ ఉందట. కేసు పెడతానంటున్నాడు. నూట యాభై రూపాయీలు తీసుకొనిపోవయ్యా అంటే ఏదో వేదాంతం చెపుతున్నాడు.

నాగయ్య:- (వెళ్ళిపోతాడు)

కేశవ:- న్యాయమంటే శవం వంటిది. దాన్నిచూస్తే దూర దూరంగా తొలగిపోతారు జనం. (గిరిధరరావు వెళ్ళి పోతాడు.)

సుద:- ఇంక నువ్వు వెళ్ళవా?

కేశవ:- నాకు యాభై రూపాయిలు కావాలి.

( రాము ప్రవేశిస్తాడు-వయస్సు 12 సం॥ )

రాము:- (కేశవదాసుతో) అన్నయ్యా! కాశీమామయ్యా, అత్తయ్యా, బావలు, అందరూ వచ్చారు— నాన్నకు జబ్బుగా ఉందని చూచిపోవటానికి. ఇంట్లో బియ్యమూ నెయ్యీ కూరలు ఏమీలేవు వదిన నీతో చెప్పిరమ్మంది. నీ కోసం ఊరంతా తిరిగాను. కాంగ్రెసు బిచ్చగాడు చెప్పాడు నీవిక్కడ ఉన్నావని.

కేశవ:- చూశావా! సుదర్శనం. నాకు డబ్బెంత అవసరమో! ఇప్పుడు వాళ్ళందరినీ మేపాలి. ఈ మేనమామను నే నొక సారి పది రూపాయ లప్పడిగితే లేదన్నాడు. మేము పేదవాళ్ళమని నే నసమర్థుణ్ణని అందరితో చెపుతాడు. మమ్మల్ని వాళ్ళందరూ గడ్డిపరకలల్లే చూస్తారు. మా నాయన చావటానికి సిద్ధంగా ఉన్నాడు. అసలు కొంపే గడవకపోతూంటే డాక్టరు బిల్లులకు నేను చస్తున్నాను. మా నాన్నా నేను ఎట్లాచస్తామో చూడటానికి వచ్చారు వీళ్ళంతా. ఆయాభై రూపాయీలు ఇట్లా పడెయ్యి.

సుద:- నీ వెక్కడో కామారపు జీడిలా ఉన్నావే.

కేశవ:- పోలీసువాళ్ళు నీ పక్షం. కోర్టులు నీ పక్షం. గవర్నమెంటు నీ పక్షం. అందరికిమల్లే నేను దెబ్బలు తినిపోతా ననుకున్నావా! నేనే నిన్ను శిక్షిస్తా. తొందరగా యియ్యిపోవాలి!

సుద:- నీవు దెబ్బలతో వంగి వచ్చేవాడవు కావు. నీకు పెద్దపనే చేయాలి.

కేశవ:- మహారాజువు. ఆ పని చేశావా! ఈ బాధ వదలి పోతుంది. నీకు **నేను శిక్ష** బాగా చేసినట్లవుతుంది.

సుద:- అంటే?

కేశవ:- ఖూనీ చేయిస్తావనుకో. ఒక నలభై యాభై వేలన్నా వదలుతై. అదే నీకు శిక్ష. నీ మదమంతా డబ్బు మద మేగా! ఆ డబ్బు ఎంత వొదిలితే అంతవరకు మదం తగ్గినట్లేగా!

రాము:- అన్నయ్యా! మామయ్యా వాళ్ళు వచ్చి చాలా సేపయింది. వదినె చాలా తొందరగా రమ్మంది.

కేశవ:- వచ్చి చేసేదేముందిరా! ఈయన డబ్బిస్తే రావాలి. అంతే.

సుద:- ఒక పాతిక రూపాయలిస్తా, తీసుకుపోతే.

కేశవ:- ఇందాక పాతికకన్న యెక్కువ లేవన్నావు. ఇన్స్పెక్టరు వస్తే నూటయాభై బయటికి వచ్చాయి. ఇప్పుడు పాతిక యిస్తా నంటున్నావు. ఇంకో జెవడో వస్తే నాలుగు వందలు వస్తవి.

( ఆనందరావు ప్రవేశం )

కేశవ:- ఆనందరావుగారూ! రండి. నాన్నగారి దగ్గర డబ్బు కోసం వచ్చారా! ఎంత కావాలి?

ఆనంద:- నాలుగు వందలు కావాలి.

కేశవ:- సరిపోయిందిగా! మీ నాన్న రోజు రోజుకు వట్టి పిసినిగొట్టు అయిపోతున్నాడండి. సుదర్శనం ఇంత డబ్బు పోగుచేస్తున్నాడు. ఇదంతా ఎవరికోసం. మీకోసమేగా!

ఆనంద:- ఏమండీ నాన్నగారూ! నిన్న కబురంపిస్తే డబ్బివ్వ లేదు. నాకు చాలా జరూరుగా కావాలి. అప్పులు నెత్తిన కూర్చున్నవి.

కేశవ:- మీరు మద్రాసు వెళ్లాలని అన్నారే ?

ఆనంద:- రాత్రి వెళ్లాలసింది. డబ్బులేక వెళ్లలేదు.

కేశవ:- మీకు డబ్బు లేకపోవటమేమిటండీ. సుదర్శనం! ఆయనను డబ్బివ్వవయ్యా! నాలుగువందలలో చచ్చిపోవు. ఆనందరావూ! రోజూ మీనాన్న నాచేత పురాణం చెప్పించుకుంటాడు. నెలకు యాభై యిస్తానన్నాడు. నాలుగు నెల్లనుంచి. మళ్ళీ నెలఅయింది. మానాన్నగారికి జబ్బుగా ఉంది. ఆ యాభై పెట్టెలోనుంచి పెగిలిరావటం లేదు. నీదగ్గర ఉంటే ఇద్దూ!

ఆనంద:- (బల్లమీద డబ్బుచూచి) ఇదిగో తీసుకోండి.

కేశవ:- నీవే యియ్యి! ఆయన యివ్వడు.

(ఆనందరావు తీసి యాభై యిస్తాడు)

సుద:- ఆ! ఆ!

కేశవ:- సుదర్శనం, నీవెలాగూ చెడిపోయినావు. కొడుకునన్నా బాగుపడనియ్యి. నీవుచేసిన పాపపుణ్యాలన్నీ అనుభవించవలసిన వాడతను గదా! సరేగాని పాపం ఆయనకు నాలుగు వందలూ ఇయ్యి. ఇద్దరమూ వెళతాము. ఆనందరావూ! ఈ గంటలో మీ నాన్నకు నూటయాభై రూపాయీలు లాభం, వూరికే కూర్చుంటే. ఆ హార్డింగు

ఇన్స్పెక్టరుకు నూటయాభై రూపాయీలు ఇవ్వబోతే అక్కరలేదని వెళ్ళాడు.

ఆనంద:- మా అయ్య అల్లాంటివాళ్ళ కిస్తాడు. కొడుక్కి ఇవ్వటమంటేనే.

సుద:- నీవన్నీ దిక్కుమాలిన ఖర్చులు పెడుతూ!

కేశవ:- సుదర్శనంగారూ! మీరు పెట్టేవి అల్లాంటివే! నా కిచ్చిన యాభై రూపాయీలు మంచి ఖర్చా! ఇది యింత టితో అయిందా!

సుద:- ఇక నీకు దమ్మిడీ యివ్వను.

కేశవ:- ఇవి నీ విచ్చావా యేమిటి?

సుద:- ఎవరయితేనేం? కవిగాడివిగదా అని ఊరుకున్నా.

కేశవ:- అందుకోసం కాదు. రంగడిచేత నావీపు పగలగొట్టించావు. నేను కేసు చేయకుండా యిచ్చావు.

సుద:- కేసు చేస్తావేం! చెయ్యి! ఏం చేస్తావో చూస్తాను.

కేశవ:- నేను చేస్తే నీకేమీ భయము లేదు. చేస్తానేమోనని భయం.

ఆనంద:- రంగడు కొట్టాడా మిమ్మల్ని?

కేశవ:- ఎబ్బె వాడిదేముంది? వాణ్ణి నేను చూసుకుంటాలే. మీ నాన్నని నువ్వు చూసిపెట్టాలి. నీకు నాలుగువందలు చాలా, ఇంకో రెండువందలు కావాలా!

ఆనంద:- ఆరువందలు కావాలి.

కేశవ:- ఆవందా తీసుకో, తక్కిన అయిదువందలూ యిస్తాడు.

సుద:- ఏమిటి! నీపని అగడంగా వుంది.

కేశవ:- నాకిస్తున్నా వేమిటయ్యా! కడుపునపుట్టిన కొడుకిస్తు న్నావు. ఇవ్వేళ ఇవ్వకపోతే రేపిస్తావు. లేకపోతే అతనికి ఎన్ని లక్షలు వస్తయ్యో భాగం పంచిపెట్టు.

సుద:- లక్షలుట లక్షలు. ఎవడి అమ్మమొగుడి సొమ్ము.

కేశవ:- నువ్వట్లా అనకూడదు. మీ నాన్న పాలేరుతనం చేశాడు. ఇది నిజంగా ఆనందరావు అమ్మ మొగుడిసొమ్ము.

సుద:- నే నెంత గడ్డికరచి సంపాదించా నంటావు?

కేశవ:- కాస్తా కూస్తా గడ్డా! నాలుగైదువందల మెకరాల గడ్డి!

సుద:- నీవెంత మాటకారివి. ఏదో తెలుగు పంతులివి అనుకున్నాను.

కేశవ:- నువ్వేకాదు. అధికారంలో ఉన్నవాళ్లంతా అట్లాగే అనుకుంటారు. ఇంగ్లీషు చదివిన వాళ్లకే తెలివి ఉంటుందని, వాళ్లే పెద్ద పెద్ద ఉద్యోగాలకు ఏసికివస్తారని. వాళ్ల తెలివి తేటల మూలంగానే దేశం ఇల్లా ఉంది. పండితుడవటంతోటే చాదస్తుడని మీ ఉద్దేశం. వాడు దుర్మార్గాలు చేయడు. అదీ వాడి చాదస్తం.

సుద:- నీవు నాదగ్గర గుమాస్తాగా ఉంటావా!

కేశవ:- నీదగ్గర ఉండను. ఆనందరావు దగ్గర ఉంటా! అయిదు వందలూ వెంటనే యియ్యి. నేను వెళ్లాలి.

సుద - నాదగ్గర లేదు.

కేశవ:- ఊరికే ధర పెరిగి పోతున్నవి. నాకు పాతిక స్తేసరి పోయేదానికి నూటయాభై చేసుకున్నావు. నాకుయాభై

ఇస్తే సరిపోయేదానికి ఆరువందలు చేసుకున్నావు. ఆనందరావుకి అయిదు వందలిస్తే సరిపోయేదానికి యాభై వేలు చేసుకుంటావు.

(రంగారావు, జనార్దనం, గోపాలాచారి ప్రవేశం)

సుద:- రండి రండి. మీరు ఇక్కడికి వస్తారనుకోలేదు. రంగడూ, మూడు కుర్చీలు తీసుకురా !

కేశవ:- నేను మీరు వస్తారని చెప్పాను.

రాము:- అన్నయ్యా! తొందరగా యింటికి పోదాం.

కేశవ:- ఆ చుట్టాలని ఎవరు రమ్మన్నారురా ! ఉండి ఉండి వాళ్ళే పోతారు.

జనార్దనం:- ఈయన మీ అబ్బాయి కాదండీ ?

కేశవ:- అవునండి. ఆయన పేరానందరావుగారు. చాలా మంచివారండి. నా పుస్తకం ఒకటి అచ్చువేయిస్తా మన్నారు. తండ్రిని అయిదు వందలడిగారు. వారిస్తా వుండగా మీరు వచ్చారు. తండ్రికొడుకు లిద్దరూ ధర్మ రాజులండి.

సుద:- ఇదుగోరా నాన్న ! డబ్బు తీసుకో !

కేశవ:- ఫరవాలేదండి. నే నాగుతాను. పెద్దలు వారు వచ్చారు. ముందర వారి పనిచూడండి.

గోపా:- ఏమీ లేదండి. మనఊళ్లో కాలేజీ పెడుతున్నాము కదండి. విశ్వవిద్యాలయంవారు రెండులక్షలు చూపించ మన్నారు.

కేశవ:- ఇంతకు ముందేనండి సుదర్శనంగారు మీ విషయం చెప్పారు. 'సుదర్శనం కాలేజీ' అని పేరు పెడితే 50 వేలు ఇస్తామన్నారండి.

సుద:- ఆనంద్! ఈ అయిదువందలూ తీసుకువెళ్లు.

కేశవ:- తొందరేమిటి! పెద్దలు—వారిని వెళ్ళనివ్వండి.

ఆనంద:- ఏమండీ, మనవూళ్ళో కాలేజీపెడితే మన కేశవ దాసుగారిని ప్రిన్సిపాలు చేస్తారా!

గోపా:- ఆయనకింగ్లీషే రాదాయెను. ఎవరినన్నా మంచి వాణ్ణి దక్షిణాదినుంచి తెస్తాం. డాక్టరయినా కావాలి.

కేశవ:- తెలుగుమాస్టరిస్తే చాలు.

జనా:- మనమవన్నీ పెట్టుకోకూడదు. విశ్వవిద్యాలయానికి అప్పచెప్పేస్తాము. వారిష్టము వచ్చినట్లు చేస్తారు.

కేశవ:- మన యిష్టంవచ్చిన వాళ్ళంతా మన్నుకొట్టుకు పోవాలన్నమాట!

గోపా:- మన కాలేజీ ఎఫీషంట్‌గా వుండాలంటే అంతే!

రంగా:- ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగమట!

కేశవ:- మీాగందరూ ఆలు. సుదర్శనంగారిచ్చేయాభయివేలూ చూలు. ఆ సోమలింగ మెవరో చెప్పండి.

గోపా:- అబ్బాయి, అవన్నీ అంతతొందరపడితే అయ్యేపనులు కావు.

కేశవ:- ఒక్క తొందరపడటమే కాదు. సత్యాగ్రహాలు చేసినా అయ్యేపనులు కావు. తెలుగు పండితుడికి ప్రిన్సిపా

లే! తెలుగు ఎం. ఏ. కు గతిలేదు. తెలుగు అక్షరాలు మారితే తెగులాయె.

రంగా:- మనం ఇన్నిమాట్లాడుతున్నాము. సుదర్శనంగారు ఏమీ మాట్లాడటంలేదు.

ఆనంద:- నాపేరూ మానాన్నగారిపేరూ కాలేజీకి పెడతారా?

గోపా:- ఇద్దరిపేరూ యెట్లా?

కేశవ:- సుదర్శనం అండ్ సన్సు కాలేజి అని.

గోపా:- బాగుంటుందా?

కేశవ:- ఎందుకు బాగుండదు? ఆర్.వి.పి, ఎల్. ఎల్.డి.ఎస్, యమ్. యస్, కాలేజి. ఇలాటిపేర్లకన్న బాగుండదూ!

రంగా:- కమిటీని కనుక్కోవాలి.

కేశవ:- కమిటీఅంటే మీరు ముగ్గురేగా! ఇప్పుడు సుదర్శనం గారూ ఆనందరావుగారూ మీ రయిదుగురేగా! ఇప్పుడే తేల్చవచ్చు.

సుదర్శ:- కాలేజీకి మన ఊరుపేరుపెడితే బాగుంటుంది.

కేశవ:- బాగుంటుంది. మడకసిరా కాలేజీ! మనవూళ్ళో కాంగ్రెసు బిచ్చగాడున్నాడు. వాడిపేరు బుంగయ్యా. దీ బుంగయ్యా కాలేజీ అంటే, మనమందరం కమ్యూనిస్టులమైనా కాంగ్రెసుఅభిమానం చూపినట్లూ ఉంటుంది.

రంగా:- ఎప్పుడూ హాస్యమేనా కేశవదాసుగారూ!

కేశవ:- లోకంలో హాస్యం అనేకరకాలు. ఈ రకం ఎల్లాంటి దంటే, ఒకడు గడ్డితింటూ ఉంటాడనుకో. అది గడ్డి అని నిరూపిస్తామనుకో. అది గడ్డి అని నిరూపించటం అతని

బాగుండదుగా! అతని మనస్సుకు తెలుసు. ఒప్పుకో కూడదు! కోపపడితే మూర్ఖుడుకూడా అవుతాడు. అందు చేత నవ్వేస్తాడు. ఇదొకరకం హాస్యం.

గోపాలాచారి:- సరే మేము వెళతాం. చెక్కు ఎప్పుడిప్పిస్తారు?

సుద:- పద్దు వేసుకోండి. ఇస్తాను లెండి. ఇంక తప్పుతుందా.

(గోపాలాచారితో ముగ్గురు నిష్క్రమిస్తారు.)

ఆనంద:- ఆ అయిదు వందలూ ఇవ్వండి.

సుద:- నీవు మొదట అడిగింది నాలుగువందలే నాయెను. ఆ వంద తీసుకున్నావు. మూడువంద లిస్తా తీసుకో.

కేశవ:- సుదర్శనం! ఆ అయిదువందలూ ఇయ్యి నా మాట విని. ఊరికే యాభై వేలు తగిలినవి. మళ్ళీ ఏం బెడద నెత్తికొస్తుందో.

సుద:- నీవు పట్టి శకునపక్షివి. ఇవిగో అయిదు వందలు.

(ఆనందరావు తీసికొని వెళ్లును)

సుద:- నీవుకూడా వెళ్లు వాడివెంటే.

కేశవ:- నీవు పెద్ద మనిషివి కదా! నన్నింటికి పిలిపించి కొట్టటం బాగుందీ!

సుద:- వేశావుగా యాభై వేల ఆరువందల యాభై రూపాయీలు శిక్ష.

కేశవ:- నేను వేసిన శిక్ష యాభై మాత్రమే. యాభై వేలూ మిగిలే ఉన్నవి.

రాము:- పోదాంరా! అన్నయ్యా!

కేశవ:- నేను హోటలులో భోంచేసి రాత్రికి వస్తా. మామయ్యనీ వాళ్ళనీ వెళ్ళనియ్యి. తిండిలేక మాడి వాళ్లే వెళ్తారు. దేశంలో కొన్ని నిప్పులు. సంసారాల్లో కొన్ని నిప్పులు. మనకు చేతనైనంతవరకు నీళ్లుపోసి ఆర్పటమే పని. మనం తిండిలేక చస్తూంటే మన ఇంటికి ఏ మొగం పెట్టుకు వచ్చారురా! వీళ్ళు చూస్తేగాని నాన్నకు జబ్బు నిమ్మదించదా! ఎదటివాడి కష్టాలంటే లెక్కలేదురా యీ డబ్బుగలవాళ్లకి. బ్రాహ్మలు, బ్రాహ్మణేతరులూ, ఇవి కులాలు కావు. సృష్టిలో మూడే కులాలు ఉన్నవి. ఉద్యోగస్థులూ, ధనవంతులూ, పేదవాళ్లూ. ఈ మూడు కులాలు చేస్తున్నవి యేం చేస్తున్నా. ఉద్యోగస్థులు ఇందులో బ్రాహ్మలు. వాళ్లు తక్కిన కులభేదాల పేరు చెప్పి తమ అధికారం సాగిస్తారు. ఈ ధనవంతు లున్నారే, వీళ్ళు గొర్రెలమంద. డూడూ బసవన్నా! పాలు త్రాగుతావా! ప్రత్తివిత్తులు తింటావా! అంటే ప్రతిదానికీ తల ఆడించటమే.

రాము:- ఏమిటన్నయ్యా! రా! పోదాము.

కేశవ:- నేను రాను ఫో! నేను రానన్నానని చెప్పు వదినతో. నే నెక్కడికో పోతున్నాను. నాకు ఉద్యోగంకూడా పోయింది. సంపాదన లేదు. ఇంటికి వచ్చి యేం చేస్తాను?

సుద:- మరింకేమి చేస్తావు?

కేశవ:- రాజకీయాల్లో దిగుతాను. ఇంక గతేముంది? దేశనాయకుణ్ణి అవుతాను.

( వెళ్ళిపోతాడు రాములో సహా )

సుద:- ఒరేయి రంగడూ !

రంగడు:- (వచ్చి) ఏం బాబూ !

సుద:- చవట వెధవా !

రంగడు :- ఓయిబాబోయి ! మీకు తెల్దు. ఆయన నన్నూ కొట్టేశాడు. నేనల్లా కిందేశి నాగీశాను. అంతే. ఆ అప్పలసామి వున్నాడండీ- ఆడికి నామైన అసలే కారంగా వుంది. ఈనకీ ఆడికీ నేస్తం బాబూ, నా నెఱుగుదు. నాకు భయమేసింది.

సుద:- నాకూ భయమేసిందిరా !

రంగ:- మొసలినోట్లో సెయ్యి పెట్టేశాం బాబూ !

సుద:- యాభయి రూపాయిలు కొట్టేశాడురా!

రంగ:- శేతిదెబ్బేంటి బాబూ, పోలీసాళ్ళతో శెప్పెయండి బాబూ.

సుద:- వాడు పోలీసోళ్ళనోట, నానోటా దుమ్ముకొట్టాడు.

రంగ:- ఇంగ్లీసు గింగ్లీసు ఏమీ రాదుగా బాబు ఆయునకి.

సుద:- వచ్చినవాళ్లు ఏమి యేడుస్తారోయి. నోరుమూసు వెళ్ళలే యిదివరకు?

రంగ:- అయితే ఆ సదువుకంటె మన సదువే గొప్పదంటా రేంటి?

సుద:-పోనీయి! వాణ్ణి మళ్ళీ ఈవేపు రాకుండా చేయలేవూ!

రంగ:-నేనా బాబు! అప్పలసామి లేకపోతే ఒకసెయ్యి చూత్తాను.

సుద:- సరే కానీ!



# అంతా నాటకమే

## అంకము 2

[కేశవదాసు ఇల్లు. కేశవదాసు, రాము, రంగమ్మ]

కేశవ:- మామయ్యా అత్తయ్యావాళ్ళు నిన్ననే వెళ్ళారా!

రంగ :- అత్త నోట్లో గిద్ద కొట్టి అత్తా నీకేం కావాలే అని అడిగారట.

కేశవ:- అదెవరో నీవంటి కోడలే అయి ఉంటుంది.

రంగ:- నా వంటి కోడలు కాదు. మీ వంటి కోడలే.

కేశవ:- నే నయితే అల్లుణ్ణి. సరే ఏమన్నా అన్నారా!

రంగ:- అన్నారా! ఒక మాటా! ఆవిడ మరీను. ఈ వెధవ కొంపకి ఎందు కొచ్చామనీ, వీళ్లుచస్తే మాత్రం మనకేం, మనమెందుకు చూడటానికి రావాలనీ, వాళ్ళదేమి తప్పు, బుద్ధితక్కువ మనదేనని, తినటానికి తిండిలేని వాళ్లింటికి తీసుకువచ్చారని.— ఆ చదువులు నాకు రావు.

కేశవ:- నువ్వేమన్నావు?

రంగ:- నే నా! తలతీసుకు వెళ్లి యెక్కడో పెట్టుకోవాలసి వచ్చింది.

కేశవ:- ఎక్కడేమిటి?

రంగ :- ఊరుకోండి యెవరైనా నవ్వుకుపోతారు ?

కేశవ:- అసలు లోక మెందుకు పుట్టిందనుకున్నావు. నవ్వేందుకే పుట్టింది. చూడు. దారివెంట ఎవడైనా పోతూ కాల్తు

జారి పడతాడనుకో, చూచిన నలుగురూ నవ్వుతారుగాని జాలిపడి దగ్గరకు వెళ్లి లేవతీసే వా డుంటాడా! అదే వరస. ఎవడైనా కష్టపడుతూ ఉంటే వాడసమర్థుడని, వాడిరోగం అల్లాగేనుదరాలని అంటారే తప్ప ఒక్కడైనా సాయపడతాడా! వాళ్ళు మనం దరిద్రులమని తిట్టి పోయి నారు గాని అయ్యో! వీళ్ళు ఇబ్బంది పడుతున్నారని పది రూపాయిలు ఇచ్చి పోయినారా! రోగమూ సాలును నాలుగైదు వేలు వస్తవే!

రంగ:- మనకిచ్చేందుకే.

కేశవ:- మన కిమ్మన్నానా! వచ్చినన సొమ్ము తినపద్దన్నాను.

రంగ:-మరి నేనూ రామూ మామగారూ ఏమికావాలి.

కేశ:- మామగారు ఏంకావాలో చెప్పావుగా, మామగారే అవుతారు. నీవూ రామూ వదినే మరిదీ అవుతారు.

రంగ:- మీతో మాట్లాడటంకంటె చేసే ఉపవాసాలు చేస్తూఉండటమే మంచిది.

కేశవ:- నలభై రూపాయిలు తెచ్చాను. ఇంక ఉపవాసాలు అక్కరలేదు.

రాము :- యాభై రూపాయిలుగా అన్నయ్యా!

కేశవ :- రెండు రోజులు నేను హోటలులో తినలేదా! మళ్లీ యెవళ్ళయినా ఉద్యోగం ఇస్తారేమోనని తిరుగలేదా!

రంగ:- ఎవరన్నా యిచ్చారా!

కేశవ :- ఈ దేశంలో నావంటివాడికి ఉద్యోగమే! ఉద్యోగం నావంటివాడికే! ఒకచోటికి వెళితే వాడి వర్ణం నా వర్ణం

ఒకటి కాదు. నా తండ్రి పెద్ద ఉద్యోగస్థుడు కాడు. పలుకుబడీ లేదు. పట్టుమని పది వోట్లైనా చేతిలో లేవు. వీటికి తోడు నేను స్కూలుఫైనలయినా ప్యాసుకాలేదు.

రంగ:- విద్వానుకు వెళ్ళమంటే వెళ్ళరాదేను.

కేశవ:- విద్వానవుతాను. కులం మారుతానంటావా!

రంగ:- మరింకేమి చెయ్యాలి!

కేశవ:- విద్వానే చదువుదామని ఇప్పుడు మొదలెడితే ఆరేళ్లకి గాని అది కాదు. ఎంట్రన్సు, ప్రిలిమినరీ, ఫైనల్, ఈ ఆరేళ్ళూ ఏం చేద్దాం?

రంగ:- చిన్నప్పుడే చదవాలిసింది.

కేశవ:- డబ్బుంటే పుట్టకముందే చదివేవాణ్ణి. అసలు ఎం.ఏ. ప్యాసయ్యే పుట్టుక వచ్చేవాణ్ణి. అట్టే మాట్లాడితే పెద్ద ఉద్యోగిగానే పుట్టుక వచ్చేవాణ్ణి.

రంగ:- ఎవరయినా ఉద్యోగి అయ్యే పుట్టుక వస్తారేమిటి?

కేశవ:- నేను కవినై పుట్టుకురాలా! నా తెలుగు భాష నాకు వచ్చు. నా అంతట నేను చదువుకున్నాను. ఇందులో పరీక్ష యెందుకునాకు. అందులో ఆరేళ్ళా! అరవయి యేళ్లు వచ్చి చదువుకోక మన్నుకొట్టుకుంటారా అని అది యిప్పుడా! ఏదయినా గుమాస్తా యిస్తే కూడికలు తీసివేతలేగా! అవి యింగ్లీషులో చెయ్యాలి. కూడికలు తీసివేతలు తెలుగులో చెయ్యకూడదు.

రంగ:- మా మేనమామ కొడుక్కి సినిమాలో నెలకు నాలుగు వందలు జీతం.

కేశవ:- నీవు లక్ష ఉద్యోగాలు చెప్పు. నాకు ఆశ్రయించటం చేతకాదు.

రంగ:- మీా రందర్నీ తిట్టటమే నాయెను.

కేశవ:- నీవుకూడా అదే అన్నావు. అందరికీ ఒకటే వ్యాధి. లోకంలో అన్యాయం చూచి యిది అన్యాయమని చెపితే అది తిట్టటమా! విషయం విమర్శించి చెపితే అది తిట్టా! ఇవి అమ్మాబూతులా!

రంగ:- ఇంటి ఆయన మీారు రాగానే తనని కలుసుకోమన్నాడు

కేశవ:- వాడికి కూడా ఏదైనా వ్యాధి పుట్టిందేమిటి? ఇన్నాళ్ళూ ఇంట్లో ఊరికే ఉండనిస్తున్నాడు. లేచి పొమ్మంటాడా? అద్దె యిమ్మంటాడా!

శేషగిరి:- (వచ్చి) ఏమోయిదాసు, ఎక్కడికి వెళ్ళావు? రెండురోజులు పెళ్లాం బిడ్డలు ఏంకావాలి?

కేశవ:- పెళ్ళాం అది. బిడ్డనువ్వా?

రంగ:- బిడ్డ ఆయనకా అక్కరలేదు. తమ్ముడున్నాడు. నాన్నగారున్నారు.

రాము:- నువ్వా బిడ్డవే!

శేష:- అదుగో! కవిగారి తమ్ముడు. ఆడబిడ్డ అంటారుకాదూ!

రంగ:- అందరూ పండితులే. ఇంట్లో బియ్యంలేవు తప్ప.

శేష:- నీ వోటు నమోజు చెయ్యలేదు. 50 రూపాయలు కట్టి నమోజు చేసాను.

కేశవ:- యాభైరూపాయిలు కట్టావు! ఆ డబ్బు నాకిస్తే నెలనాళ్ళు గడిచేదే. గవర్నమెంటు కిచ్చావా! నా పేరు వాళ్లు మొదటే వ్రాసుకోవాలి. వ్రాసుకోకపోతే తప్పు ఎవరిది? మనకు యాభైరూపాయిలిచ్చి వ్రాసుకోవాలి. ఏమి రాజ్యంరా బాబూ! వీళ్లకు డబ్బుదాహం. ప్రజా సౌఖ్యం అక్కరలేదు.

రంగ:- అవధి యెక్కడ! ఆయన లేకపోతే యీ సంసారం ఏం అయ్యేదో! ఇంకా యాభైరూపాయీ లివ్వాలిట!

రాము:- ఈ రెండు రోజులూ ఆయనే గడిపాడుగా ఇల్లు.

శేషగిరి:- సరేకాని ఆయ నెవరో వచ్చారోయి నిన్ను చూడాలని. నీ కవిత్వం చదివాడట. నిన్ను చూడాలని-

కేశవ:- ఎవరాయన!

శేష:- విశాఖపట్నంలో మేష్టరీ చేశాడట. 55 ఏళ్ళు అయినవి అని రిటైరు చేయించారు. ఈ ఊరి హైస్కూలుకు హెడ్మాష్టరుగా తీసుకువచ్చారు.

కేశవ:- ఆ వూళ్ళో పనికిరాలేదు. ఈ వూళ్లో ఎట్లా పనికి వచ్చాడు?

శేష:- పెద్ద పెద్ద ఉద్యోగాలకి పనికివస్తారోయి. వందల మీద ఉండాలి జీతం.

కేశవ:- చచ్చే వరకు అక్కడే ఉంచుకోరాదూ?

రాము:- చావకపోతే! (శేషగిరి కేశవదాసులు నవ్వుతారు)

రంగమ్మ:- ఆ అన్నకు తమ్ముడవు.

(బయటనుంచి - దాసుగారున్నారా అండి)

కేశవ:- ఎవరో రండి. ఉన్నాను.

(నాగయ్య రాగా రంగమ్మ లోపలికి వెళుతుంది.)

కేశవ :- రా! నాగయ్యా! ఏమి మాయింటికి వచ్చావు. కూర్చో.

నాగయ్య :- (కూర్చుని) ఏమీలేదు. నేను ఎసెంబ్లీకి నుల్చుంటున్నాగదా! నిన్ను చూచిపోదామని వచ్చాను.

కేశవ :- ఎవరో సుదర్శనం వంటివాళ్లను చూడాలిగాని——

నాగయ్య:- ఇంకా నీవదే అనుకుంటున్నావు. నీ వతనిమీద ఛార్జి పెట్టు. నేను సాక్ష్యం చెపుతాను.

కేశవ :- ఏమని చెపుతావు. సుదర్శనం అల్లాంటివాడా! అని చెపుతావు. కాదు. నిజంచెపుతావు. ఎలెక్షను ఏమవుతుంది? ఎందుకూ పనికిరాని నాతో నే పని ఉండి వచ్చావే! ఇక అంతటి సుదర్శనాన్ని కాదంటావా! ఎలెక్షనంటే యేమిటి? మొగమాటం, ఆశ్రియింపు, తద్వారా అన్యాయమూ!

నాగయ్య:- నీవు నాకు సహాయం చెయ్యాలి!

కేశవ:- నీవు సింహానివి. నేను ఎలుకను. తాళ్లిప్పు కొరుకుమంటావా!

నాగయ్య:- నీతో ఎవరు మాట్లాడగలరు. నీవు కవివి.

కేశవ:- ఏమి సహాయమో చెప్పు.

నాగయ్య:- ముందర నీ వోటు నా కివ్వాలి.

కేశవ:- నా వోటితనిది. ఇతనిపేరు శేషగిరి. ఈ యిల్లి తనిదే. నన్ను రెండేళ్ళమట్టి ఊరికే తన యింట్లో ఉంచుకొంటున్నాడు. 50 రూపాయీలిచ్చి నా పేరు నమోజు చేయించాడు.

నాగయ్య:- నాకు కాన్వాస్సు చేసిపెట్టాలి.

కేశవ :- అసలు సంగతి అల్లాచెప్పు. నే నింకెందుకు పనికి వస్తాను.

నాగయ్య :- నిన్ను తక్కువ చెయ్యటం కాదు. నీవు స్నేహితుడవు కనుక.

కేశవ :- సరే చేస్తాను నిన్ను గురించి నేనేమని చెప్పాలి ? బి. ఏ. ప్యాసయినావని చెప్పనా! పండితుడవని చెప్పనా! న్యాయస్థుడవని చెప్పనా! ఏంచెప్పాలి?

నాగయ్య:- మనదేముంది ? మనపార్టీ బలం. మన పార్టీకి వోటు చెయ్యమనిచెప్పాలి.

కేశవ:- పార్టీకి ఆదర్శాలు ఉంటవి. ఆ పార్టీలోవాళ్ళు వాటిని ఆచరించాలిగదా ! కనీసం ఆ ఆదర్శాలు ఇవి అని అయినా తెలుసుకునే తెలివితేటలయినా ఉండాలిగదా !

నాగయ్య :- ఎప్పుడూ ఇల్లాగే మాట్లాడతావు నువ్వు.

కేశవ:- నా కిదొక జబ్బు, దానితోనే తీసుకుంటున్నాను.

శేషగిరి:- నాగయ్యగారూ! అతను చెప్పే మాట నిజమే నండీ! మిమ్మల్ని అనటం కాదుగాని చదువుకున్నవాళ్ళు న్యాయస్థులూ ఉండాలండీ!

నాగయ్య:- ఇది పార్టీ వ్యవహారమండీ !

కేశవ:- అవును. ఇది నిజంగా ప్రజాస్వామిక రాజ్యంకాదు. పార్టీస్వామిక రాజ్య మనాలి దీన్ని. ప్రజల బల మేముంది యిందులో? పార్టీ బలమే కాని.

నాగయ్య:- ఎన్నుకోనేది ప్రజలేగా!

శేషగిరి:- ప్రజలు మేము ఇతన్ని ఎన్నుకుంటున్నాము అనటం లేదు. మీరు కొందరిని చూపించి వీళ్ళల్లో ఎవరినో ఒకరిని ఎన్నుకోమంటున్నారు. అందుచేత ప్రజలు వాళ్ళంతట వాళ్ళు ఎవరిని ఎన్నుకుంటారో వాళ్ళు రావటంలేదు.

నాగయ్య:- ఎవరు వద్దన్నారు, ప్రజలనే ఎన్నుకోమనండి.

కేశవ:- గొంగట్లో భోంచేస్తూ వెంట్రుకలు లెక్కపెట్టాడట. ముందర ధరావతు కట్టాలి. ఎలెక్షనుకు పదివేలో పాతికవేలో ఖర్చుపెట్టాలి. పార్లమెంటరీబోర్డులు పార్టీ వాళ్ళూ మనుష్యులని నిర్ణయిస్తా రాయెను. ఫలానా వాళ్లు కాండిడేట్లని నిర్ణయించేది మీరు గారు. ప్రజలు.

నాగయ్య:- ప్రజలే ఎన్నుకోటం ఎల్లాగా!

శేషగిరి:- ఎల్లాగో మనమూ చెప్పేది- ఇదుంతా యిట్లా అని మనం చెప్పామా!

నాగయ్య:- ప్రజలకు వదలిపెట్టితే వాళ్ళకేమీ తెలియదు-

శేషగిరి:- అసలు ఎన్నికలు పెట్టకూడదు- ఫలానావాడు సత్పురుషుడు అంటే అతన్ని పెట్టటమే!

నాగయ్య:- ఎవడా సత్పురుషుడు-

శేషగిరి:- వాడెవడో అందరికీ తెలుసు. ఇడుగో కేశవదాసు ఇతను సత్పురుషుడు- అన్యాయం సహించలేడు. చదువు

కున్నవాడు. ఈ పేట పేటంతా అతన్ని పెటితే వద్దనరు. పెట్టే దిక్కెవరు? అతనికి ఇంగ్లీషు రాదు. పలుకుబడి లేదు. ధన మంతకుముందే లేదు.

కేశవ:- ఇదొకటి పెట్టకు. తిండికి లేకపోయినా ఎల్లాగో అల్లాగు బ్రితుకుతున్నాను.

శేష:- చూశావా! సత్పురుషులు ఇల్లాంటివాటి జోలికే రారు. ఎవడికి అధికారవాంఛ ఉంటుందో, యెవడికి గొప్పవాణ్ణి అవుదామని ఉంటుందో, యెవడు పిల్లిమీద యెలికను ఎలుక మీద పిల్లినీ యెక్కిస్తాడో వాడికి కావాలి యీ అధికారాలు. వాళ్ళూ మనసు పాలకులు.

నాగయ్య:- మరి నీవన్నట్లుగానే ఈ సత్పురుషులు రారుగా.

శేషగిరి:- రాజ్యాంగమూ ఎన్నికల పదకము అల్లాపెట్టారు- వాళ్లు రాకండా చేసి వాళ్లు రారంటే ఎట్లా! ఈ దేశం ఎన్నికలూ రాజ్యాంగమూ ఇల్లా ఉన్నన్నాళ్ళూ వారు రారు-

(బిల్లుకలెక్టరు ప్రవేశము)

బిల్లుక:- శేషగిరిరావుగారెవరండి?

శేష:- నేనే.

బిల్లుక:- మీరు రెండు వాయిదాలివ్వాలండి పన్ను. నేను బిల్లుకలెక్టరును.

శేష:- ఎంత యివ్వాలి.

బిల్లుక:- పన్ను పెంచారు. రెండు అరవై నాలుగు లివ్వాలి.

శేష:- పూర్వం మా యింటికి ముప్పయి రూపాయిలేనయ్యా!

బి. క:- అవునండి, రెట్టింపుచేశారు.

శేష:- వాకిట్లో మురుగు మురుగుగానే ఉండె. మాసందు మొదట ఒకదీపంవెయ్యమంటే వేసే దిక్కులేదు. మాసందులో రోడ్డు మరమ్మత్తు చేయటానికి రాళ్ళు తోలించారు. తోలించి రెండేళ్ళయింది. అదివరకు ఏబురదలోనైనా నడవటానికైనా వీలుగా ఉండేది. ఇప్పుడదీలేదు. రైలుదిగి బండి యెక్కివస్తే గడపదాకారాదు. ఇంటిపన్ను మాత్రం రెట్టింపుచేశారు. మ్యునిసిపాలిటీకి లక్షరూపాయీలు వస్తవట. ఏంచేస్తున్నారో!

బి. క:- నన్నడిగితే నేనేంచెపుతానండి.

కేశవ:- రైలులో టిక్కెట్టు కలెక్టర్లూ ఇట్లాగే అంటారు; అధికారం చేసే వాడొకడు. అమలు జరిపే వాడొకడు. అమలుజరిపే వాడికి గవ్వంత అధికారంలేదు. అందుచేత న్యాయవిచారణ జరుగదు.

నాగయ్య:- నీవు కోర్టులో దావా వేసుకోవచ్చు.

కేశవ:- ఊరికే వేసిపెడతారేమిటి? దాని కెంత ఖర్చు. సంవత్సరాలుపడతవి. మన పని వదలుకొని కోర్టు చుట్టూ తిరగాలి.

శేషగిరి:- నేను ఇవ్వను.

బి. క:- సరే జప్తుచేస్తాము.

కేశవ:- అయినా రెట్టింపేమిటయ్యా!

బి. క:- ఇల్లు అద్దెకు ఇచ్చారు కాదండీ.

28.8.54

కేశవ:— ఉపకారానికి పోతే ఉరుమురిమి నెత్తిమీద పడ్డదట. నేనూరికే ఉంటున్నా నీయింట్లో.

బి. క:— మీరద్దె యిస్తున్నారని యెవరో పిటీషన్ పెట్టారు.

కేశవ:— ఎవరో కాదు. మన స్వతంత్ర భారతీయులు. భారతీయులు కాదు, మన ఫ్రీయిండియనులు.

బి. క:— మీరు డబ్బు కట్టి అర్జీ పెట్టుకోండి.

శేషగిరి:— ఏమిటీన్యాయం. విచారణ చేయకుండా నీవు పన్ను వేయటమేమిటి? నేను ముందర డబ్బుకట్టి నీ వెంట తిరగట మేమిటి ?

కేశవ:— గవర్నమెంటు అంటే అంతే.

శేషగిరి:— రేపు రండి యిస్తాను.

బి. క:— రేపు మళ్లీ నేను రాలేను.

నాగయ్య:— కోపపడకయ్యా! రేపురా.

బి. క:— నేనివ్వను, జప్తుచేసుకో అన్నారు కదండీ!

కేశవ :— ఏదో పొరపాటున అన్నాడులే బాబూ! నీవు కలెక్టరువని తెలియక అన్నాడు.

బి. క:— అంత ఆక్షేపణ యేమిటీ?

శేషగిరి :— ఆక్షేపణ యేముంది? నీవు కలెక్టరు వేగా, బిల్లు వెనకుంది అంతే, కర్రిగాని కరేపనుకో; జీలకర్ర మాత్రం కర్రికాదా!

కేశవ :— కాకపోతే అది పొడుపు కథెందుకవుతుంది?

బి. క:— అంత తెలివెందుకు మీకు. మీకులం ఎక్కడికి పోతుంది? దేశాన్నంతా యిదివరకే పాడుచేశారు. ఇంకా

పాడుచేద్దామనా? ఇంక మీశాస్త్రాలు పురాణాలు పనికి రావు. ఆరోజులు వెళ్లిపోయినవి. తెలివిపోతున్నారు, తెలివి.

నాగయ్య :- నవ్వుతూ అంటే అంతకోపమెందుకులే. రేపిస్తానన్నాడుగా. రేపురద్దూ.

బి. క :- ఏమిటండీ మీరుకూడా సర్దిచెపుతారు. వాళ్లన్న మాట లెట్లా ఉన్నయి. పొడుపుకథలట, బిల్లుకలెక్టరట! బిల్లుకలెక్టరు మనిషికాదేమి. బి. ఏలు ఎం. ఏలు ప్యాసయితేనే మనిషా!

కేశవ:- ఇక్కడ బి. ఏ లు ఎం. ఏలు ఎవరు ప్యాసయినారంటావు !

బి. క:- మీ జాతి యేమిటంటే మేము చదువుకున్నామనీ, గొప్పవాళ్లమనీ, మనమంటే అందరూ పడిఉండాలని. అసలందుకనే మీరిట్లా అయినారు.

కేశవ:- అవును బాబూ! మనమందరమూ ఇట్లా అయింది కూడా యిందుకనే.

బి. క:- చాలులేవయ్యా! మాటలు నేర్చావు. పన్ను ఇవ్వడట. జప్తు చేసుకోవాలిట. పొడుపుకథలు. ఇల్లాంటి వాళ్ళని చాలా మందిని చూశాను.

కేశవ:- శేషగిరి! డబ్బుంటే తీసికొనివచ్చి యిచ్చేశెయి.

(శేషగిరి వెళ్ళును)

కేశవ:- అంతకోప మెందుకయ్యా! నీపేరేమిటి?

బి. క:- నాపేరేమయితే మీకెందుకు ?

నాగయ్య:- పేరడిగితే చెప్పకూడదా! ఏదో మాటా మాటా వస్తేనే అంత విరోధమెందుకు?

బి. క:- మురళీధరరావు

కేశవ:- కాశీపతిగారేమన్నా చుట్టమా నీకు?

బి. క:- మా అన్నగారే.

కేశవ:- అల్లా చెప్పు, సరిగ్గా ఆయనకు మల్లేనే ఉంటే అడిగా. అతనికీ నాకూ చాలాస్నేహంలే. అతని భార్యాకు ఈమధ్య చాలా జబ్బుచేసింది. నిమ్మదిగా ఉందా!

బి. క:- నిమ్మదించింది. రెండువందలు ఖర్చయింది.

కేశవ:- రెండు నెలల జీతమన్నమాట.

బి. క:- ఏమి ఉద్యోగాలండీయివి. నామట్టుకు నాకు నెలకు అమాంబాతు నలభైఆరు వస్తవి. నాకు నలుగురు పిల్లలు, పెళ్ళికావలసిన మరదలు. రేషన్ కొనుక్కునేందుకు చాలటంలేదు.

(శేషగిరి వచ్చును.)

శేషగిరి:- లెక్కచూడు బాబూ! నీడబ్బు నీకిస్తాను.

కేశవ:- ఆయనడబ్బేమటి అది. ఆయన డబ్బయితే యిప్పుడే తగ్గించేవాడు.

బి. క:- అవునండీ! మీయింట్లో అద్దెకుండటంలేదు. నేను చెప్పాను. వాళ్ళు వినలేదు. వాళ్ళకేమిటండీ! ఊరికే డబ్బురావాలి. ఇదిగో నూట యిరవైయేడుంబావలా అయింది.

శేష:- ఇవిగో నూట ముప్ఫయిరూపాయిలు. రసీదులు, చిల్లరా యిన్వండి.

కేశవ:- ఇంకా చిల్లరేమిటి? పాపమాయన చాలాసార్లు తిరిగాడు.

శేష:- సరే తీసుకోమను.

బి. క:- నాకక్కరలేదు లేండి.

కేశవ:- ఫరవాలేదులే, నీవూ సంసారంకలవాడవు. ఇదేం లంచమాయేమిటి? అసలు లంచాలను పుచ్చుకునేవాళ్లని పట్టుకోనేలేము.

బి. క:- ఇవిగో రసీదులు. చిల్లర లేదు.

శేష:- అక్కరలేదులే. నవ్వుతూ అన్నమాటలకు అంత కోపం తెచ్చుకున్నావు.

బి. క:- కాదు బాబూ! మాదేముంది. వసూలుచేయలేదని వాళ్ళు మాప్రాణాలు తీస్తారాయెను. మీరా! యింత పన్ను ఎక్కువ వేయటమేమిటంటారు. మేమేం చెయ్యాలి? సెలవు వస్తాను. (దణ్ణంపెట్టి వెళ్లి పోతాడు)

కేశవ:- అతనికి వర్ణభేదం ఉందంటావా నాగయ్యా!

నాగయ్య:- నీ ప్రశ్న నాకర్థంకాలేదు.

కేశవ:- అతను వర్ణభేదం కులభేదం మాట్లాడాడు కదా. చివరకు ఏమీ లేదుకదా! వాళ్లన్నయ్యాను నే నెఱుగుదును అంటే శాంతించాడు. చిల్లరతీసుకోమంటే దండం కూడాపెట్టి వెళ్ళాడు. పేదవాడు. మరెందుకల్లా అన్నాడనిప్రశ్న. ఏకులమయితే అతనికేం చెప్పు! కోపంవచ్చింది.

రానటం మానవ ప్రకృతి. కులాన్ని యెత్తటం, లోకంలో అధికారం చేసేవాళ్ళు చేసేప్రచారపు మాటలు వినటం. అతని కేమీ తెలియదు. ఆ ప్రచార మెందుకు చేస్తు న్నారో కూడా తెలియదు. మనం చెపుతామనుకో. అర్థంచేసుకోలేడు కూడాను.

నాగయ్య:- అందుకనే అందరూ చదవాలి అన్నారు.

శేష:- చదవాలి నిజమే. చదనటానికి డబ్బు కావాలిగా. అందరూ చదవాలి అన్నవాళ్లు అందరికీ డబ్బులేకుండా చదువు చెప్పాలి. అందరూ ఈక్వల్ అంటే సరిపోదు. ఈక్వల్ ఛాన్సెసు యివ్వాలి. అదంటావు. ఇది చెయ్యావు.

నాగయ్య:- నేనా! నాదేముంది యిందులో.

కేశవ:- రేపు నువ్వూ యెస్సెంబ్లీలో ఒకడవుగా. నీవెట్లా చేస్తే అట్లా.

నాగయ్య:- నీవు ప్రచారంచేసిపెడితే గెలుస్తా?

కేశవ:- నీకు ప్రచారమున్నూ నాకు సంచారమున్నూ! సరే, యీ రెండు మూడు నెలలైనా యిల్లు గడుస్తుంది. కాని య్యా, నెలకెంత యిస్తావు ?

నాగయ్య:- నీకిష్టము వచ్చినంత తీసుకో.

కేశవ:- నాకు నీడబ్బూ వద్దు, ప్రచారమూవద్దు, నన్ను నీవు దురర్థం చేసుకోనంటే ఒక మాట చెపుతా.

నాగయ్య:- చెప్పు.

కేశవ:- చెపుతానుగాని నీకు నచ్చదు. నీవు వినవు. అయినా చెపుతాను. నేనీ దేశంలో ఎందుకూకాను. ఒకమంత్రిని

గాను, నాయకుణ్ని కాను. చివరకు ఏబిసీడీలు కూడా రావు. ఆ తెలుగులోనే విద్వాను కూడా యేడవలేదు. నామాట యెవరు వింటారు? నేనంటే కవి నని నీకు నామీద అభి మానం.

నాగయ్య:- నీవొక్క కవివే నా! నీ అంత తెలివి ఎవరికుంటుంది?

కేశవ:- నీ వింగ్లీషు చదవలేదు. కనుక నీకట్లాగే అనిపిస్తుంది. నీ జ్ఞానం కృత్రిమ శాస్త్రాలు చదవటంచేత కలుషితం కాలేదు కనుక. నామీద నీకంతఅభిమానం ఉండి సుదర్శనందగ్గర నాపక్షం మాట్లాడలేక పోయినావు. అది నీ దోషంకాదు. ఎలెక్షనుకు నిల్చుందామనుకున్న దోషం. నీవు పాతిక వేలు పెట్టగలుగుదువు గనుక నిన్ను నిలబెట్టారు. వస్తావు. ఈ పాతిక వేలు మళ్ళీ తిరిగి యెట్లా వస్తావా అని తరువాత తంటాలుపడాలిగద. అప్పుడు న్యాయంగా ఎల్లాఉంటావు? పైగా నీవు ఆ మినిస్టర్లు వాళ్ళంత కుంభకోణం చేయలేవు. వాళ్ళు చెయ్యెత్త మంటే చెయ్యెత్తటానికి పాతిక వేలు ఖర్చెందుకు? ఇది యెంత వ్యామోహమో నీవే చూడు. ఎం. ఎల్. సి. అంటే ఏమన్నా గౌరవముందా! మంత్రి అంటే ఉంది. చివరకు నిన్ను పిలిపించి ఒక కాఫీహోటలుకూడా తెర వ మనరు. నీవంటివాళ్ళను ప్రజలు ఎన్నుకోటమా! ఆ మంత్రులు నలుగురూ రాజ్యం చెయ్యటమా! అది ప్రజారాజ్యమా!

నాగయ్య:- మ రేం చేయమంటావు?

కేశవ:- మానేశెయ్యి, భగవంతుడేదోయిచ్చాడు. ఈ గవర్నమెంటు ఇట్లాగే ఉన్నంత వరకూ ఆ భగవంతు డిచ్చి నదానికి ఫరవాలేదు. యీ పాతిక వేలూ ఏ పేద వాళ్ళకన్నా యియ్యి. యిష్టంలేకపోతే దాచుకో. తీర్ధ యాత్రలుచెయ్యి. అందులో ఏముందంటావా! పోయి దేశంచూచిరా! లేకపోతే.

నాగయ్య:- మరి అంతా ఇదివరకే బిగిసి పోయినాగా!

కేశవ:- అప్పుడేయేమయింది. ఎం. ఎల్. సి కావాలి, యింకా బిగుస్తావు.

నాగయ్య:- ఈ మాటలకేంగాని మూడు నెలలు నీ కుటుంబం గడుస్తుంది. నీవు ప్రచారంచేసి పెడుదూ!

కేశవ:- నేను ప్రచారం చేస్తే నాకేదో ముట్ట చెబుదామని. ఊరికేనే యెందుకివ్వకూడదు? వ్యామోహం అంటే ఇందులో ఉంది. నాయందు ప్రేమఉంది, అందులో స్వార్థం ఉండాలి,

నాగయ్య:- నీవు కాలికి వేస్తే వ్రేలికి వ్రేలికి వేస్తే కాలికి లాగుతావు.

కేశవ:- నీవు ఎల్లాంటి వాడ వంటే రెండు మాయలు కల వాడవు. ఒకటి సృష్టి తోనే ఒక మాయ ఉంది. దాన్ని మూలప్రకృతి అంటారు. అది మొదటి అజ్ఞానం. మొదటి మాయ. రెండవది ఈ ప్రస్తుత నాగరికత వ్యాపింప చేసిన మాయ. ఈరెండూ కలిసి నీలో ఉన్నవి. విశేషమేమి

టంటే నీవంటివాళ్ళ మూలంగానే యీనాగరకతావ్యూహం చక్కగా సాగుతున్నది.

నాగయ్య:- నీఉపన్యాసాలు చాలు గాని నేనువెళుతున్నాను. నీకు ఉద్యోగము లేదు గదా, ఏంచేస్తావు ?

కేశవ:- నాకుద్యోగము లేకేమి. సుదర్శనం దగ్గర ఉంది.

నాగయ్య:- నీ ఉద్యోగం తీసివేశాడుగా.

కేశవ:- అతని కొడుకు నాకుద్యోగ మిచ్చాడు.

నాగయ్య:- నిజంగానా! నెల కెంత యిస్తానన్నాడు?

కేశవ:- అది సుదర్శనం అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది.

నాగయ్య:- అడుగో, ఆనందరావు వస్తున్నాడు.

(ఆనందరావు వచ్చును)

ఆనంద:- నమస్కారమండి! నాగయ్యగారు!

నాగయ్య:- మీరు కేశవదాసుగారికి ఉద్యోగమిచ్చారటగా?

కేశవ:- ఆయన యివ్వలేదు అసలాయన యివ్వటమేమిటి? నేనే తీసుకున్నాను. కొందరిదగ్గర ధనముంటుంది. ఎల్లా అనుభవించాలో తెలియదు. లోభి డబ్బు కూడబెడతాడు. అదృష్టవంతుడు దాన్ని ఉపయోగిస్తాడు మనుష్యుడు బ్రతకటానికి అన్నోదకాలుంటే చాలు. అంతకు మించి ఎంతో ఉంటే యేంచెయ్యాలి? నీకు మల్లే ఎలెక్షనుకు పెట్టాలి. లేకపోతే యేదోవిధంగా సంతోషం కలగటం కోసం వినియోగ పరచాలి. గుర్రపు పందేలమీద పెడతామనుకో, ఏమిటి దానికీ దీనికీ భేదం ? ఎలెక్షనులో గెలుస్తామాలేదా అన్న దిగులు. గుర్రాలు పరుగెత్తు

తూంటే చూట్టం చాల సరదాగా ఉంటుంది. మద్రాసులో సినిమాలకు వెళ్లవచ్చు, ఇంకా లక్ష సుఖాలు అనుభవించవచ్చు. సుఖం అనుభవించటం ఎల్లాగో నేర్చుకొని ఉండాలి.

ఆనంద:- కేశవదాసుగారూ! నేనిందుకే వచ్చా మీయింటికి. మద్రాసు ఎప్పుడు వెళ్ళుదాము?

కేశవ:- ఇవ్వేళ వెళదాము. నాకెప్పుడైతే యేమి. ఇంట్లో పదిరోజులకు తినేందుకు వేసిపోతే చాలు.

ఆనంద:- ఈపాతిక రూపాయిలు తీసుకవెళ్లి కొనుక్కురండి. సాయంత్రం వెళదాము.

కేశవ:- పోదాం రండి.

ఆనంద:- నేనివ్వేళ ఇంటికి వెళ్లను.

కేశవ:- ఏం?

ఆనంద:- ఇవ్వేళ ఇంటిదగ్గర ఒకటి జరిగిందిలెండి. మీరు వెళ్లి రండి నేనిక్కడే ఉంటాను.

రాము:- (వచ్చి) అన్నయ్యా! వదినె పుట్టింటికి వెళుతా నంటోంది.

కేశవ:- ఎందుకు?

రాము:- ఇక్కడ తినటానికికూడా తిండి లేదట. వెళ్ళిపోతా నంటోంది.

కేశవ:- బజారు వెడుతున్నాను. ఇన్ని తీసుకువస్తాను. ఉండమను. ఏం కావాలో కనుక్కురా!

రాము:- ఇదిగో వ్రాసి యిచ్చింది. ఇవి తీసికొని వస్తేనే ఉంటుందట. లేకపోతే సాయంత్రం వెళ్ళిపోతుందట.

కేశవ:- ఇటుతే. ఇవ్వాయిపోయింతరువాత మళ్ళీ వెళ్ళేదేగా! సరేలే. ఇప్పటికి వెళ్ళను. కానియ్యి. నీవుకూడా బజారు రా! అన్నీ కొనుక్కొద్దాము. నీకొక్కణ్ణీ మోసుకు రావాలి. ఆనందరావుగారూ! మా నాన్నగారికి జబ్బుగా ఉంది. దొడ్లో పంచాదిలో పడుకుంటారు. విరారొక్కరూ ఉండాలి యిక్కడ.

ఆనం:- తొందరగా రండి. ఫరవాలేదు, ఉంటాను. ఇక్కడే కూర్చుంటాను.

( కేశవ - రాము - నాగయ్య - శేషగిరి వెళ్ళిపోతారు. )

రంగమ్మ:- (ప్రవేశించి) వెళ్ళారా?

ఆనం:- ఇప్పుడే వెళ్ళారండి. బజారుకి వెళ్ళి వస్తువులు తీసుకు రమ్మన్నారుగా!

రంగమ్మ:- మీరెవరు? ఇక్కడ కూర్చున్నారేం?

ఆనం:- ఆయనా నేనూ కలిసి సాయంత్రం మద్రాస్ వెళుతున్నాం. నేనే యిచ్చాను డబ్బాయనకు. మళ్ళీ పది రోజులదాకా రాము. ఈలోపుగా సామగ్రి అంతా కొని యింట్లో ఇచ్చి పొమ్మని—

రంగమ్మ:- మీది మద్రాసా?

ఆనం:- కాదండి యీవూరే. మీవారు తెలుగుమాస్టరు చేస్తూ ఉండేవారే స్కూలు, అది మా నాయనగారి స్కూలే.

రంగమ్మ:- మీరు సుదర్శనంగారి కుమాళ్ళా ?

ఆనం:- అవునండి.

రంగమ్మ:- వారికి మీ నాన్నగారు ఉద్యోగం తీసివేశారట కదా !

ఆనం:- తీసివేస్తే యేమిలెండి నేనున్నాగా ! నెలకు 50రూపాయిల చొప్పున నేనిస్తానులెండి.

రంగమ్మ:- మీకు మద్రాసులో ఏమి పని అండి.

ఆనం:- మద్రాసులోనా! హైకోర్టులో కొంత వ్యవహారముంది. మంత్రులతో మాట్లాడాలి. అక్కడ మాకొక లక్ష రూపాయిలు రావాలి. వెళ్లి పదిరోజులుంటేగాని ఈ పనులయ్యేట్లు లేవు.

రంగ:- పదిరోజులదాకా రాకపోతే యెల్లా ! మా మామగారికి చాలా జబ్బుగా ఉంది. ఆయన యెప్పుడేమవుతాడో తెలియదు.

ఆనం-: అంత పదిరోజుల్లోనేనా !

రంగ:- మా మరిదికూడా వెళ్ళాడా !

ఆనం:- వస్తువులన్నీ తాను ఒక్కడూ మోసుకు రాలేనని తీసుకు వెళ్ళారు. వంట అయిందా అండి.

రంగ:- అన్నీతీసుకురావాలి, వంటచెయ్యాలి. తీసుకువచ్చేవాటిల్లో సగమప్పులు తీర్చటానికే సరిపోతవి.

ఆనం:- కేశవదాసుగారు మంచి తెలివిగలవాడండి. కాని అందరినీ విమర్శిస్తాడు. అందుచేత పయికి రానివ్వటం లేదు ఎవ్వరూనూ !

రంగ:- మనపని మనం చేసుకోవాలిగాని అందరి విషయం మనకెందుకు!

ఆనం:- అందరూ అట్లా ఉంటారా యేమిటి?

రంగ:- తనకెందుకు చెప్పండి. మనకు నాలుగువేళ్లూ నోట్లోకి పోవాయెను. మనకు జరుగుపాటు లేదు. మంత్రిలని వైసుఛాన్సలర్లని గవర్నర్లని విమర్శించటం. మనకు తెలిసినంత వాళ్లకు తెలియదు కాబోలు.

ఆనం:- మీరేమన్నా చదువుకున్నారా అండి.

రంగ:- ఫోర్తుఫారందాకా చదువుకున్నాను.

ఆనం:- మీకు కేశవదాసుగారికన్న ఎక్కువ ఇంగ్లీషే వచ్చు. మరి మిమ్మల్ని వీరికిచ్చారేం?

రంగ:- నా కీయన వేలువిడిచిన మేనత్తకొడుకు. నేను పుట్టినప్పటినుంచి యీయనపెళ్ళాం అన్నారట. చివరకి బంధుత్వంలో పొరుపులు వస్తయి అని యిచ్చారు. మా అందరిదీ ఒక ఊరే. బంధుత్వం దూరమయినా కలగలుపుగా ఉంటారు.

ఆనం:- కేశవదాసుగారు ఎందుకు చదువుకోలేదు?

రంగ:- వీళ్లకు ఏమీలేదు, ఏం చదువుతారు?

ఆనం:- మీరు కలవాళ్లుకాబోలు.

రంగ:- ఏమి కలవాళ్లములెండి. వీళ్లకన్న నయము.

(లోపలినుంచి రంగమ్మా అని పిలుపు)

రంగ: అదిగో ఇదొక తద్దినంనాకు.

(వెళ్ళును)

(సావడిలో గోడకు నిలువుటద్దం వుంటే ఆనందరావు పోయి దానిలో చూచుకుంటూ తల దువ్వుకుంటూ ఉంటాడు.)

గిరిధరరావు:- (వచ్చి) కేశవదాసుగారు లేరాఅండి.

ఆనంద: ఎవరు మీరు ?

గిరి: నాపేరు గిరిధరరావు.

ఆనం: కేశవదాసుగారితో ఏమయినా పనుందా !

గిరి: పనేమీలేదు, వారితో ఒకమాట చెప్పి పోదామని వచ్చాను.

ఆనం: నాతో చెప్పండి వారితో చెపుతాను వచ్చిన తరువాత.

గిరి: మీరెవరండి.

ఆనం: నేను వారి స్నేహితుడను, మీరు నాతో చెపితే ఆయనతో చెప్పినట్లే.

గిరి: ఏమీలేదండి. నేను సూపరింటెండెంట్ గు ఇన్స్పెక్టరుని. ఈ ఊళ్ళో ఒకాయన మిల్లులో ఆరువేల బస్తా నిలవ ఉంది. నేను పట్టుకుని తాళాలువేసి కేసుపెట్టాను. నాకు జరిగిన ఫలితం ఏమిటంటే నా ఉద్యోగం తీసివేశారు. ఇల్లా ఉందండి రాజ్యం. ఆయన చెప్పనే చెప్పాడు. ఉద్యోగం జాగ్రత్త పిచ్చిపనులు చేయవద్దని. నాకే బుద్ధిలేక పోయింది.

ఆనం: ఎవరాయన ?

గిరి: ఆయన పేరుకూడా యెందుకులెండి. పేరు చెపితే ఏం తప్పో! ఇదివరకు ఉద్యోగమేపోయింది, ఈసారి ప్రాణం కూడా పోతుందేమో !

ఆనం: ఈ ఊళ్ళో రెండే మిల్లులున్నాయి. గోపాలాచార్లు గారి దొకటిన్నూ, (ఆగి) సుదర్శనంగారి దొకటిన్నూ. గోపాలాచారిగారి మిల్లుకోనా!

గిరి: కాదండి.

ఆనం: సుదర్శనంగారి మిల్లులోనన్నమాట.

గిరి: వాడిమిల్లులోనే.

ఆనం: వాడంటున్నావే, కొంచెం జాగ్రత్తగా మాట్లాడు.

గిరి: ఆయన నా నోటిముందర కూడు తీసివేయ వచ్చుగాని నేనంటే తప్పా!

ఆనం: తప్పా, మరీతప్పా!

రంగ: (వచ్చి) ఏమిటండీ అదీ!

గిరి: మీరు కేశవదాసుగారిభార్యా అండి.

రంగ: అవును.

గిరి: ఏమీలేదండి. నేను మీవారితో ఏదో చెప్పుదామని వచ్చాను. ఈయన వారి స్నేహితుడనని తనతో అది చెప్పనున్నాడు. నేను చెప్పనంటే నడేసి లాగాడు. ఈ ఊళ్ళో ఒకాయన నా ఉద్యోగం తీయించేశాడు. నేను ఆయనను 'వాడు' అన్నానట. ఈయన నామీద లేస్తున్నాడు.

రంగ: ఎవరాయన ?

గిరి: సుదర్శనంగారని.

రంగ: ఈయన సుదర్శనంగారి కొడుకే.

గిరి: అల్లాగా బాబూ! మీరూ మీనాన్నగారూ వేయి

కాలాలపాటు బ్రతకండి. ఈదేశాన్ని రక్షించండి. నేవెళు తున్నాను. అల్లాగా బాబూ! ఎక్కడికిపోతయి గుణాలు. వంశం వంశం అంతా ఒకటే రకం.

ఆనం:- నోరు మూసుకువెళ్లు.

గిరి:- చిత్తం. అల్లాగే. తమరితో చెప్పటానికి రాలేదు. మీరే అడిగారు. చెప్పమని బలవంతంచేశారు. చెప్పాను. ఆయన మీ నాయనగారని నాకేమి తెలుసు.

ఆనం: తెలియకపోతే వాడంటావన్నమాట.

గిరి: మీకు తెలియకండా ఆయన్ని యెంతమంది తిడుతు న్నారో!

ఆనం: వచ్చి నా దగ్గర తిట్టమను. తెలుస్తుంది.

(గిరిధరరావు వెళతాడు)

ఆనం: మా నాన్నగారిని వాడంటాడా అండి.

రంగ: అతని ఉద్యోగంతీయించేస్తే అతనికి మండదా!

ఆనం: కేశవదాసు ఉద్యోగం తీసెయ్యాలేదా! ఆయన తిట్టాడా!

రంగ: ఆయనకు మీరు డబ్బిస్తున్నారు గనుక తిట్టటంలేదు.

ఆనం: మొదటనే తిట్టలేను. అందుకనే యిస్తానన్నాను.

రంగ: డబ్బుగలవాళ్ళూ అధికారంగలవాళ్ళూ ఇంతే.

ఆనం: ఎంత?

రంగ: మీరు అపకారం చేస్తారు. మిమ్మల్ని యేమీ అనకూడదు. అంటే ఇంకా అపకారంచేస్తారు. వాళ్లని బ్రతక్కుండా కూడా చేస్తారు.

శేషగిరి: (వచ్చి) కేశవదాసు వచ్చాడా ?
ఆనం: రాలేదు.

(శేషగిరి రంగమ్మవంక తీక్ష్ణంగా చూచి వెళతాడు)

రంగ: ఆయన చూచారా !
ఆనం: ఏమిటి ?
రంగ: ఆ చూడటం !
ఆనం: ఏం చూశాడు !
రంగ: డబ్బుగలవాళ్లకు పొగరుబోతుతనంతప్ప మరేమీ తెలియదు. మీ యెదట మీ నాన్నగారిని తిటితే ఏదో తెలుస్తుందంటిరే ?
ఆనం: అవును, నా యెదుట అనమను.
రంగ: నేనంటున్నాను, మీ నాయన రావణాసురుడు, దైత్యుడు, మనుష్యులని కొట్టిస్తాడు, ఉద్యోగాలుతీయిస్తాడు, బ్లాకు మార్కెట్టు చేస్తాడు, గడ్డి తింటాడు, అన్నంతినడు, ఆయన మనుష్యుడుకాదు. పశువు.
ఆనం: (నవ్వుతూ) నీవంటేనా!
రంగ: ఎవరనాలి?
ఆనం: మగవాళ్ల నాలి.
రంగ: ఈ కాలంలో మగవాళ్లే ఆడవాళ్లు ఆడవాళ్లే మగవాళ్లు.
ఆనం: నేనాడదాన్ని అయితే నావంటి ఆడవాళ్ళు మా నాన్నగారిని ఏమయినా అంటే అప్పుడు చెపుతాను.
రంగ: ఇప్పుడేవస్తారు ఉండండి.

ఆనం: ఎక్కడికీ వెళ్లను. రానీయి. అసలు నేనిక్కడినుంచి వెళ్లనేవెళ్లను.

రంగ: ఏంగిరాకీ!

ఆనం: నువ్వంటే నాకు——

రంగ: ఏమిటి నేనంటే నీకు.

ఆనం: నేను నీవంటి ఆడదాన్ని ఇదివరకు చూడలేదు.

రంగ: నేనూ యిదివరకు నీవంటి ఆడదాన్ని చూడలేదు.

శేషగిరి: (వచ్చి) దాసువచ్చాడా?

ఆనం: రండి కూర్చోండి.

శేషగిరి: మీాయిద్దరూ ఏదో మా ట్లాడుకుంటున్నారు. నే నెందుకు.

రంగ: ఏమీాలేదు. ఆయన నావంటి ఆడదాన్ని యిదివరకు చూడలేదట చెబుతున్నాడు. మీారు వీళ్ల నాన్నగారిని యెరుగుదురా ?

శేషగిరి: బాగా నేడుంది, ఈ ఊళ్లో వారి నెవరెరుగరు?

రంగ: ఆయన ఎల్లాంటి వాడండి!

శేష: గొప్పవాడు.

రంగ: అంటే డబ్బుగలవాడని. అధికారం గలవాళ్ళూ డబ్బు గలవాళ్ళూ మనదేశంలో గొప్పవాళ్ళైననుకోండి మంచి తనం లోకోపకారం ఇవి ఉండాలి. ఇతరులకు అపకారం చేసేవాళ్లు ఎల్లాంటివాళ్లంటారు?

శేష: ఎల్లాంటివాళ్ళేమిటి ! నట్టినీచులు.

రంగ: నీచులుకాదు. పశువులు. కుక్కలు.

శేష: అంతే!

రంగ: అదిగో శేషగిరిగారు మీ నాయనగారిని యేమంటున్నాడో చూడండి.

ఆనం: మా నాయనగారి పేరెత్తండే!

రంగ: ఏమండీ! ఇప్పుడు మీరన్నదెవరిని ?

శేష: ఏమిటీగోలంతా!

రంగ: ఈ రాజ్యం మగవాళ్లు చేయటం మూలంగా ఇల్లా ఉంది. ఒకడు నిజం చెప్పలేడు. అందరికీ మొగమాటం. భయమున్నా. నిజం ,, ఒకడు చెప్పడు. చెప్పలేడు. ఆడవాళ్లు రాజ్యం చేస్తే యిల్లా ఉండదు. గాంధిగారు చెప్పిన రాజ్యం అప్పుడు వస్తుంది.

ఆనం: మేమందరం ఆడవాళ్లమేగదా!

రంగ: మీ మొగానికితోడు అదొక గొప్పా! మీరు ఆడవాళ్లు కాదు. మీరు ఖోజ్జాలు. నపుంసకులు. బృహన్నలలు.

ఆనం: (విరగబడి నవ్వును)

(కేశవదాసు, రాము, వస్తారు)

రాము: వదినే! ఇవ్వేళ సగ్గుబియ్యం పరవాన్నం చెయ్యాలి. జీడిపప్పు కిస్మిస్సు అన్నీ తెచ్చాము.

కేశ: ఏమిటి! అందరూ ఇక్కడే ఉన్నారు.

రంగ: ఇంట్లో యేమీ లేవాయెను. నేను ఈ ఆనందరావుగారితో మాట్లాడుతూ కూర్చుంటే శేషగిరిరావుగారు వచ్చారు. గిరిధరరావుగారట యెవరో వచ్చారు.

మీకోసం, హార్పింగు ఇన్‌స్పెక్టరట ! ఆయన ఉద్యోగం పోయిందట. సుదర్శనంగారు తీయించివేశారట.

కేశవ: అనుకున్నంతా అయిందన్నమాట. ఇల్లా ఉంది రాజ్యం.

రంగ: ఆయనా అదే అన్నాడు.

కేశవ: బద్మాషుముండా కొడుకొలు.

రంగ: అదుగోనయ్యా ! మీ నాన్నని తిడుతున్నాడు. ఏం చేస్తావో చెయ్యి.

ఆనం: మందిమీద తిటితే నాకేం! మా నాయనగారి పేరెత్తి తిట్టాలి.

రంగ: నీ వాడదాన వంటావేం ! పసిపిల్లాడవు.

కేశవ: మీయిద్దరికీ యింతదూరం ఎల్లా వచ్చింది ?

రంగ: ఆయన ధనవంతుడు. మగవాడు. నేను ఆడదాన్ని. పేదదాన్ని. ఎంతదూరం రాక యేమవుతుంది? ఆయన యిక్కడినుంచి వెళ్ళనే వెళ్ళడట. హిందూకోడు బిల్లు ప్యాసయిందా !

కేశవ: సగంలో ఆగిపోయింది.

రంగ: మరియెట్లా? అయినాయేమిలాభంలెండి.

శేష: అంటే అర్ధమేమిటమ్మా!

రంగ: నేను కేశవదాసుగారి భార్యనాయె. ఆబిల్లు పెట్టించిన వాళ్ల పెళ్ళాన్నయితే బాగుండేది. వెంటనే విడాకు లిచ్చే దాన్ని. వాళ్ళు కష్టపడరుగా. పాపం నేనిపుడు

వెళ్ళిపోతే మా ఆయన పేదవాడాయెను. ఈయన బ్రతుకేమి కావాలి? అందులో మంచంలో ఉన్నతండ్రి.

ఆనం: నేను వెళుతున్నాను.

రంగ: ఇక్కడే ఉండిపోతానన్నావుగా. నిన్ను వెళ్లనివ్వను. నీవు వెళితే మా సంసారం ఏమి కావాలి? మీ ఉద్యోగంలో మేముండాలి అంటే పది నెలజీతమయినా అడ్వాన్సు ఇవ్వాలి. ఇచ్చి వెళ్లండి. చూడండి జేబులో ఎంత డబ్బుందో. చూడండి.

ఆనం: నాల్గు వందలే ఉంది.

రంగ: ప్రస్తుతం అదిచాలు. తక్కినదంతా సాయంత్రం తెచ్చి యిద్దురుగాని. ఇవ్వండి. ప్రాణంబప్పటం లేదేమిటి? మా మామగారు సాయంత్రమో ప్రొద్దునో. మాకు బోలెడంత ఖర్చుంది. మీాయిష్టం. మళ్ళీ బిల్లు ప్యాసయే లోపుగా నాకు ఏది కావలిస్తే అది యిస్తూఉండండి.

(లోపలినుంచి రంగమ్మా అని పెద్దకేక) ఒక్కఆనందరావుతప్ప
(అందరూ లోపలికి వెళతారు)

ఆనంద: ఈమనిషి చాలా చమత్కారంగా ఉందే. నిజమా! అబద్ధమా! మొగుడుండగానే అల్లా మాట్లాడు తున్నదే. అయినా వదలిపెట్టిపోకూడదు.

రంగమ్మ: (వచ్చి) మామామగారు పోయినారు. (కన్నీళ్ళు పెట్టుకుంటుంది).

ఆనంద: ఇవిగో నాలుగువందలు. ఇంకా యెంతకావాలి?

రంగమ్మ: (తీసికొని) మళ్ళీ పదిరోజులయింతరువాత కావాలి. మీదయ. మీరెంత యిస్తే అంత. మాడబ్బు మీదగ్గిర దాచపెట్టామా?

ఆనంద: అదేమిమాట! నాడబ్బే నీడబ్బు.

రంగమ్మ: కేశవదాసుగారు చాలా పేదవాడు.

ఆనంద: ఆయన కెంతకావలిస్తే అంత యిస్తాను.

(శేషగిరి, కేశవదాసు వస్తారు)

శేష: మరి నేను బజారు వెళ్లివస్తాను.

కేశవ: డబ్బుకావాలిగా!

శేష: ఫరవాలేదులే.

రంగ: ఇదుగో ఈ వంద రూపాయీలు తీసుకువెళ్లండి. ఆనందరావు ఇచ్చాడు నాలుగు వందలు. పన్నెండు రోజులకూ కావాలిగదా!

(శేషగిరి వెళతాడు) (లోపలినుంచి రాము ఏడుపు)

కేశవ: రంగా! యింట్లోకిపో రాముని పట్టుకో (రంగమ్మ-వెళ్లును) ఆనందరావుగారూ! మా అమ్మగారుపోయి పన్నెండేళ్లయింది. వాణ్ని కన్నది, చనిపోయింది. మానాన్నగారే మాకు వండి పెట్టేవాడు. మా రంగ కాపురానికి వచ్చి నాలుగేళ్లయింది. అది వచ్చిన తరువాత నేను చేతులు కాల్చుకోటం తప్పింది. అది లేకపోతే నేనూ మాతమ్ముడూ ఏమయ్యేవాళ్లమో! అది నన్ను వదలిపోతే నా బ్రతుకు ఏమవుతుందో యేంచెప్పను. (ఏడ్చును)

ఆనం: ఆవిడ చాలా కష్టపడు తున్నది మీ యింట్లో.

కేశవ: మాకు బ్రతుకుదల లేదాయెను. కష్టంరాక సుఖ మెక్కడినుంచి వస్తుంది?

ఆనం: అంత తెలివిగల అమ్మాయి ఈకష్టాలు పడటమేమిటి? వంట చేసేందుకు ఎవరినన్నా పెట్టుకోరాదా?

కేశవ: తా దూర కంతలేదు. మెడకొక డోలట.

ఆనం: ఏదోలే మంచి రోజులురాక పోతయ్యా! మనం మద్రాసు వెళ్ళటం ఇప్పుడు పడదన్నమాటేగా.

కేశవ: ఈపన్నెండు రోజులూ గడవాలిగా! మీరు వెళ్ళిరండి.

ఆనం: ప్రస్తుతం యీ నాలు వందలూ చాలుగా!

కేశవ: చాలకేం? దేవుడల్లే వేళకు మీరున్నారు.

ఆనం: మరి నన్నొక్కణ్ణే వెళ్ళమంటారా మద్రాసు.

కేశవ: గిరిధరరావుని తీసుకువెళితే? అతనికీ ఉద్యోగం లేదు. పైగా మీ నాన్న మూలంగానే పోయింది. అది మీ ధర్మం.

ఆనం: అతన్ని నేను కొడతానన్నాను. నాతో వస్తాడా! (గిరిధరరావు వస్తాడు)

కేశవ: మీకు వెయ్యేళ్ళండీ! మీమాటే అనుకుంటున్నాము.

గిరిధర: మీ నాన్నగారు పోయి నారని చెప్పారు శేషగిరి రావుగారు. మీరుదుఃఖంలో మునిగి ఉంటారనుకున్నాను.

కేశవ: దరిద్రుడికి దుఃఖమేమిటి? ఎప్పుడూ దుఃఖమే. అందు చేత మన దుఃఖం దుఃఖంగా కనిపించదు. పైగా మా నాయనగారు ఎప్పుడో పోతారనుకుంటూ ఉన్నదే.

గిరిధర: మళ్ళీ వస్తాను.

కేశవ: మళ్ళీవస్తాను కాదు. నేనూఆనందరావుగారూమద్రాసు వెళదా మనుకున్నాము. నే నిప్పుడు వెళ్ళటానికి వీలు లేదుగదా. మీరు వెళ్ళాలి.

గిరిధర: నేనా? బాగానే ఉంది!

ఆనంద: ఫరవాలేదయ్యా! ఇందాక నవ్వుతూ అన్నాను.

గిరిధర: అక్కడ పనియేమిటి?

ఆనంద: పనేమీలేదు. నాకుతోడు. నా కేదైనా సలహా యిస్తూ ఉండటం. చిన్న పనులుఉంటూ ఉంటవి. అంతే.

గిరిధర: ఎప్పుడు బయలుదేరాలి?

ఆనంద: ఇవ్వేళనే.

గిరిధర: ఇక్కడ నే నేదైనా చూచుకు రావాలా?

కేశవ: మీ కిప్పుడెంత కావాలి!

గిరిధర: ఒక యాభై రూపాయలయినా ఉంటేగాని యెల్లా బయలుదేరటం? ఇంటి దగ్గర చిన్నచిన్నప్పులు తీర్చిరావాలి గదా!

కేశవ: రంగా!

రంగ: (వచ్చి) ఏమిటి?

కేశవ: వీరికి నీ దగ్గర ఉన్న డబ్బులో 50 రూపాయీ లియ్యి.

ఆనంద: అక్కరలేదు లెండి. నే నిస్తాను. మా యింటికి రండి. ఒక గంట ఆగి నే నిస్తాను. ఇంక నేను వెళతాను. దాసు గారూ, రంగమ్మగారూ! సెలవా!

రంగమ్మ: మీరు వెళ్ళటం నాకిష్టంలేదుగాని పరిస్థితి యిల్లా ఉంది. మదరాసునుండి రావటంతోటే రావాలి.

ఆనంద: తప్పకుండా వస్తాను. (వెళ్ళిపోతాడు)

గిరిధర: ఏమిటండీ యిదంతాను.

కేశవ: క॥ చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు పామరుడుతగన్
హేమంబు కూడఁబెట్టిన
భూమీశుల పాలు చేరు—

గిరిధర: మనం భూమీశులమా!

కేశవ: ఇది ప్రజాస్వామికం గాదూ. ప్రజలే స్వాములు. అంటే రాజులు. మన మందరమూ భూమీశులమే.

గిరిధర: నేను వెళ్ళి యేం చెయ్యాలో నాకు తెలియటంలేదు.

కేశవ: ఆయన గుర్రాల పందేలకు వెళతాడు. నీవూ వెళ్లు. సినీమాలకు వెళతాడు, వెళ్లు. నీవుకూడా లక్షాధికారి వలె ఖర్చుపెట్టు. అన్నీ అతనే పెట్టుకుంటాడు. నీకు చేతనైంది నీవు మిగుల్చుకో. అతని మనస్సుకు విలాసంగా ఉండే అన్ని పనులూ చేయించు.

గిరిధర: ఇవన్నీ నాచేత కావే!

కేశవ: లంచం పుచ్చుకోటం చేతకాని వాడవు. నీ చేత నవునని నేననుకున్నానా! ఊరికే నా బదులు వెళ్లిరా, ఈ పది రోజులూ.

గిరిధర: నా కేమైనా జీతమిస్తాడా!

కేశవ: ఇందులో జీతమని ఉండదు. వచ్చేటప్పుడు నీ యింటిల్లి పాదికకు సంవత్సరానికి సరిపోయే గుడ్డలు కొనుక్కురా, మంచి వెలగలవి కొను. ఏ వస్తువు కావలిస్తే అది కొను.

అక్కడుండగానే యింటికి పంపించాలి. ఒక యాభై యిమ్మను. ఇస్తాడు. ఇదంతా జీతమంటావా.

గిరిధర: సరే! వెళతాను.

కేశవ: అతను డబ్బుగలవాడు. నీ వతనిమీద ఆధారపడి ఉన్నట్లు కాదు. అసలు యజమానివి నీవు. అల్లా ప్రవర్తించాలి. అప్రధాన విషయాలన్నీ అతను చెప్పినట్లు చెయ్యి. ప్రధాన విషయాల్లో "నీకేమీ తెలియదు, ఊరుకో" అను. ఒక్కడవు ఉన్నప్పుడు నీవూ అను, తిరస్కరించు. వేళాకోళం చెయ్యి. ఇతరులు ఉన్నపుడు ఆనందరావుగారు అను. నీవు ఆయనకు విధేయుడవు అన్నట్లుండు.

గిరిధర: ఇవన్నీ చెపితే వచ్చేవికావు. సహజంగా చేత కావాలిగాని.

కేశవ: అయితే ఒక్క మంత్రం చెబుతా నేర్చుకో. నన్ను కేశవదాసు పంపించాడు, నీవు నేను చెప్పినట్లు వినకపోతే కేశవదాసుతో చెపుతానంటూ ఉండు. అదే బెదిరింపు క్రింద తేలుతుంది. చిన్న చిన్న పనులన్నీ నీవు చేయవయ్యా! నీవు లేకపోతే చచ్చిపోతా ననుకుంటాడు. తరువాత నీ వెట్లా చెప్పితే అల్లా చేస్తాడు. అదీ రహస్యం.

# అంతా నాటకమే

## అంకము 3

(ఆనందరావు ఇల్లు) (కేశవదాసు, గిరిధరరావు ఉందురు.)

కేశవ: ఎప్పుడు వచ్చారు?

గిరిధర: రాత్రి వచ్చాము.

కేశవ: ఏ మాత్రం ఖర్చు పెట్టించావు.

గిరిధర: ఒక వెయ్యి రూపాయి లయింది.

కేశవ: పదిరోజు లున్నారు. కనీసం పది వేలయినా కావలసింది.

గిరిధర: ఎట్లా అవుతుంది?

కేశవ: నీతి అంటేయేమిటో తెలిస్తే అవుతుంది.

గిరిధర: నీతా! అదెట్లా ఉంటుంది.

(పదిమంది పాడుతూ వెళ్ళుతూఉంటారు)

తిరుపతి వేంకటనాథా! నాథా! నీ
గిరికి చేదుకోవయ్యా! జియ్యా ॥తిరు॥
హరిజనులను నీయండ చేరితిమి
పరమేశ్వర! యీ భేదమేమిటికి ॥తిరు॥
మాకులమంతయు మాలవారనుచు
తేనువ యుగములు దిగద్రొక్కిరి మము
నీకరుణారఝురి నిక్కిపొంగువగా
నీకోవెలలో నిలుతుము స్వామీ ॥తిరు॥

(పాటకులు వెళ్ళిపోతారు)

కేశవ: ఇదొక నీతి. మనదేశంలో మాల మాదిగ లున్నారు. వాళ్ళను ఉండటానికి యిళ్ళులేవు. స్నానం చేసే యోగ్యత లేదు. తినటానికి తిండిలేదు. వాటి విషయం చూసేదిక్కు లేదు. వాళ్ళను దేవాలయ ప్రవేశం చేయిస్తున్నారు. ఈ ఎటిలో పడి వాళ్ళు తిండీ నీళ్ళ మాట యెత్తరు.

గిరిధర: వాళ్ళకు పొలా లిస్తున్నారు. నూతులు త్రవ్విస్తున్నారు.

కేశవ: ఓహూ! నీవు కొన్నాళ్ళు గవర్నమెంటు ఉద్యోగం చేశావు కాబోలు. మరిచిపోయినా!

గిరిధర: అంటే?

కేశవ: అంటే ! మన మనస్సు అల్లా ఉంటుందన్న మాట. పొలాలు ఎంత మందికిచ్చారు? అసలు పొలాలెక్కడున్నయి. నాన్‌కో ఆపరేషన్‌లో జైలుకు వెళ్లినవాళ్ల కెన్ని పొలాలిచ్చారు. వీళ్ల కెన్ని పొలా లిచ్చారు. రాజకీయ బాధితులని పేరు ఒక్కొక్కళ్ళకు యాభై యెకరా లున్నయి. వాళ్లకు పది పది ఎకరా లివ్వటం. ఇక నూతు లున్నవి. గవర్నమెంటు గ్రాంటే కనిపిస్తున్నది కాని నూతులు కనిపించటంలేదు. ఆ డబ్బు ఎవడో దేశోద్ధారకుడు తీసుకుంటాడు. మళ్ళీ కనపడదు. ఇది యేమయిందని అడిగే దిక్కులేదు. వాళ్ల డబ్బు ఆ కులనాయకుడు కాజేసాడా! ఓట్లన్నీ మళ్ళీ వాడికే యిస్తారు. అల్లాంటిడబ్బు ఉన్నదనే వాళ్లకు తెలియదు.

గిరిధర: మ అంత అన్యాయం అంటారా!

కేశవ: ఇది ప్రత్యక్ష ప్రమాణయుగం. అదీ నమ్మకపోతే వాళ్ళు గ్రుడ్డివాళ్లన్నమాట. వీళ్ళు గుడ్డివాళ్ళు. ప్రత్యక్ష ప్రమాణ వాదులు.

(విరగబడి నవ్వుతాడు)

గిరిధర: ఎందుకు నవ్వుతారు ?

కేశవ: నేనన్నమాటలు నీకు తెలిస్తేగా; చెవిటివాని దగ్గర శంఖం ఊదినట్లు. సరే నీవుపద! నాకు వేరే పని ఉంది.

(గిరిధరరావు వెళతాడు)

కేశవ: (ఇంటివంక చూస్తూ) ఆనందరావుగారు ఉన్నారా ? అమ్మాయి !

శకుంతల: (ప్రవేశించి) ఎవరండి మీరు?

కేశవ: నా పేరు కేశవదాసంటారు. నేను కవీశ్వరుణ్ణి.

శకుం: నేను మిమ్మల్ని ఎఱుగుదును.

కేశవ: నీవు ఆనందరావుకి ఏమవుతావు?

శకుం: చెల్లెలను. నా పేరు శకుంతల. నాకు మీ పాటలన్నీ వచ్చు.

కేశవ: నా పాటలు వస్తే యేం లాభం! నా ఆటలుకూడా నేర్చుకోవాలి.

శకుం: (నవ్వుతూ) మీరు బలేగా అంటారే! ఏమిటి మీ ఆటలు ?

కేశవ: నేను పేదవాణ్ణి! పేదవాళ్ళు ఆడే ఆటలు.

శకుం: మీరు గొప్ప కవులు. పేదవాళ్ళయితే యేం ?

కేశవ: అన్నదానవు నీవొక్కతెవు కనిపించావు. మీ అత్తవారే వూరు?

శకుం: నాకు పెళ్ళి కాలేదు.

కేశవ: మరి పేదవాణ్ణి చేసుకుంటావూ?

శకుం: మీరు బలేవారే !

కేశవ: ఉహుం! వాడు గొప్ప కవి అనుకో ! కాదమ్మా! నీవు చేసుకుంటావని కాదు. నీ వెందుకు చేసుకుంటావు. మీ వాళ్లు చేసుకోనిస్తారా యేమిటి? ఏ యాభై వేలో కట్న మిచ్చి తెస్తారు ఒకణ్ణి. వాడికీ అవతల నాలుగు మిల్లు లుండాలి. నాలుగు మేడ లుండాలి. ఎంత కథ! సరే గాని ఆనందరావుగా రున్నారా !

శకుం: నిద్రపోతున్నాడు. తొమ్మిదయితేగాని లేవడు.

కేశవ: తరువాత ఒక గంట. నేను ఆయనతో మాట్లాడాలి అంటే పదకొండింటికి రావాలన్నమాట.

శకుం: వెళ్లటమెందుకు? ఇక్కడే ఉండండి.

కేశవ: ఊరికే కూర్చోమంటావా ?

శకుం: మా యింటికి వచ్చిన యెవరూ నన్ను నువ్వుఅనరు.

కేశవ: నేను మీనాన్న నే నువ్వు అంటాను.

శకుం: మా అన్నయ్యను గారంటారేమి ?

కేశవ: అయితే నిన్నూ గారంటాలే.

శకుం: వద్దులెండి. మీ కేమన్నా జ్యోతిషం తెలుసా! మొన్న ఒకాయన వచ్చి నా జాతకంచూచాడు. మీరు కూడా చెపుతారేమోనని.

కేశవ: నాకు జాతకం తెలియదు. చెయ్యికొంచెం చూడగల్దు
 ను. ఆయన యేంచెప్పాడు ?

శకుం: మీరు చెప్పండి. తరువాత చెపుతాను.

కేశవ: మరి నీచెయ్యి నేను తాకవచ్చునా!

శకుం: చెయ్యి ముట్టుకోకుండా ఎట్లా చెపుతారు.

కేశవ: మీరు లక్షాధికారులు. నేను భిక్షాధికారిని.,

శకుం: ఏమి భిక్ష ?

కేశవ: నీదయ. చెయ్యి యిట్టుతే?

(శకుంతల చెయ్యి చూపిస్తుంది)

ఆనం: (ప్రవేశించి) ఏటది ?

శకుం: ఆయన నాచెయ్యి చూస్తున్నాడు.

కేశవ: నీ కొక సంబంధం కుదురుతుంది. అది అవుతుందా! కాదా! అన్న ప్రశ్న. అది తేలితేగాని తరవాత చెప్ప డానికి వీలులేదు.

శకుం: సరిగ్గా ఆయనా యిల్లాగే చెప్పాడు.

కేశవ: నాకూ సాముద్రికం తెలుసన్నమాట!

ఆనం: అంత బాగాచెప్పి అల్లా అంటారేమి? మీకు సాము ద్రికం తెలుసని నాతో చెప్పలేదేమి? నా చెయ్యి కూడా చూడండి.

శకుం: ముందర నన్ను కానియ్యి, ఆ పెళ్లి అయితే ఎల్లా ఉం టుంది ?

కేశవ: శతవిధాల కాదు. నేను కానివ్వను.

శకుం: మీరు చెయ్యగలుగుదురా!

కేశవ: నాకు మంత్ర శాస్త్రంకూడా వచ్చు. నేను ఇది యిల్లా కావాలి అంటే అల్లా అవుతుంది.

ఆనం: మరి ఉద్యోగం పోగొట్టుకున్నారేం?

కేశవ: నేను పోగొట్టుకోలేదు. మీనాన్న తీసివేశాడు.

శకుం: మానాన్న మీ ఉద్యోగం తీసివేశాడా!

కేశవ: ఉద్యోగం తీసివెయ్యటమేనా? యింకా చేశాడు. దానికేంలే! మీ అన్నయ్యగారు నాకు నెలకు యాభై రూపాయిలిస్తున్నాడు.

శకుం: యాభై రూపాయలేం చాలుతుంది?

కేశవ: రాజ్యం నువ్వు చేస్తే బాగుండును. జీతాలు చాలవంటూంటే ఎక్కువివ్వటానికి యేడుస్తున్నారు. పాపం వాళ్ళకిమాత్రం. వేలకొద్దీజీతాలు. వాళ్ళకు వేలుచాలవు. వీళ్లు నెల నెలకు అప్పులు చెయ్యటం. ఏరోజు కారోజు గడవటం కష్టం. ఎవడితో చెప్పుకునేది? ఇందులో వాళ్ళు వినయంగా లేరని ఉద్యోగాలు తీసివెయ్యటం. ఆశ్రయించిన వాళ్ళకి ఆ ఉద్యోగాలు ఇవ్వటం. ఆ చాలీ చాలని ఉద్యోగాలు నిలుపుకోటానికి ఈ వెధవలు కొండీలు చెప్పటం. ఆ ప్రభువులు చెప్పేను మాటలు వినటం. సమర్థుడూ స్వతంత్రుడూ రాడుగా? నాకుమల్లే మాడుతూ వుంటాడు. రాజ్యమంతా పందుల దొడ్డిగాఉంటుంది. ఏ డిపార్టుమెంటయినా అంతే. ఈ అధికారులంతా యేం చేస్తారో తెలుసునా. ఒక దుష్టపరిస్థితి యేర్పాటుచేసి సర్వకాలం అదే ఉండే టట్టు చేయటానికి నిత్యప్రయత్నం చేయటం.

శకుం: ఆ పెళ్ళి అయితే యెల్లా ఉంటుంది. అది చెప్పండి.
కేశ: నాకు మల్లే ఉంటుంది.
శకుం: మీ కేమండి గొప్ప కవులు. ఇంత పండితులు.
కేశవ: నీ కిష్టమైతే సరి!
శకుం: నా కిష్టమే.
కేశ: అయితే ఆ పెళ్ళే అవుతుంది.

( సుదర్శనం ప్రవేశం )

సుద: నువ్వు చేరావా ఇంటికి! ఏ పెళ్ళి? నా పిల్లవాణ్ణి పాడు చేస్తున్నావు చాలదూ? మా పిల్లనుకూడా పాడు చెయ్యాలా!
కేశ: నీకుమల్లే అయి పిల్లలు పాడవుతారని వాళ్ళను బాగు చేస్తున్నాను. డబ్బు ఎక్కువుంటే మదం ఎక్కువౌతుంది. అది తగ్గించాలి.
సుద: నీవు నా యింటికి రానక్కర్లేదు.
కేశ: ఇది నీ యిల్లెంతో ఆనందరావు ఇల్లంత. ఆనందరావు వద్దంటే మానేస్తాను. అసలు ఆనందరావు భాగం అతనిది అతనికి పంచిపెట్టు.
సుద: వాణ్ణి అనమను ఆ మాట.
కేశ: నే నంటూంటే మాట్లాడకుండా ఊరుకోటానికి అదే అర్థం. పంపకాలు కాకముందు ఇంకోటి ఉంది. శకుం తలను యాభై వేలు కట్నం. పెళ్లి చేసేందుకు ఒక పాతిక వేలు ఇల్లా పారవేసి మరీ పంచుకోండి. శకుంతల నా పార్టీ.

సుద: శకుంతలతో నీకింత పరిచయం ఎప్పుడైంది ?

కేశవ: నా కింగ్లీషు రాదుగానీ లవ్ ఎట్ ఫస్టుసైటు అంటారు.

శకుం: అంతే.

సుద: నీకా యింగ్లీషు తెలుసునా!

శకుం: తెలియదు. ఏదో అన్నారు కవిగారు. నేను సరే నన్నాను.

సుద: నీవు మా పిల్లలను పాడుచేస్తున్నావు. నీవు మాయింటికి రావద్దు.

కేశ: అయితే నేను మీ యింటికి రాను. మీరూ మాయిం టికి రావద్దు.

ఆనం: ఆయన యేం పాడుచేస్తున్నారు నాన్నా! నేను వారి యింటికి వెళతాను. ఆయన మన యింటికి వస్తారు.

శకుం: మానాన్న అట్లాగే అంటాడు- మీరు వస్తూ ఉండండి దాసుగారు-

కేశ: రాకపోతే నా ప్రాణం నిలుస్తుందా!

సుద: (**కేశవదాసు వంక కోపంగా చూస్తాడు.**)

కేశ: ఒక్క కొట్టించటమే బాధ కలిగించటం కాదు- అనేక విధాలుగా బాధ కలిగించవచ్చు. అనేక విధాలుగా ప్రేమ కలిగించనూవచ్చు- నాకు ఎవరైనా అపకారం చేస్తే నేను మళ్ళీ చేస్తాను- నేను చేసే అపకారం అనేక విధా లుగా ఉంటుంది- నేను ప్రేమించి ప్రత్యుపకారం చేస్తాను-

సుద: సంతోషించాము-

కేశవ: శకుంతలా! ఒక్కొక్క మాటకు వ్యతిరేకంగా వస్తుంది అర్థం. నేర్చుకో— నేను నీకు గురువుని—

(కొందరు పాడుతూ వస్తారు)

నెత్తురులు త్రాగుతాం
కత్తరులు చిమ్ముతాం
కత్తులతో వంతెనలు కట్టి యీడుస్తాం ॥నెత్తు॥

ధనిక వర్గముచేత తమ ప్రాణములు పోయి
యీడ్చువారును లేక యెండిపోయిన యట్టి
అస్థిపంజరములకు ఆయువులు పోస్తాం ॥నెత్తు॥

శకుం: ఎవళ్లు వాళ్లు?

కేశవ: అదొక ప్రచండ రాజకీయ పక్షం.

శకుం: మరి మన గవర్నమెంటు వీళ్ళనేమీ చెయ్యదా!

కేశవ: ఎందుకు చెయ్యదు. చేసింది. ఎలెక్షనుకు వదలి పెట్టారు.

శకుం: వాళ్ళ ప్రభుత్వం వస్తే?

కేశవ: న్యాయంగా ఉంటే ఎవళ్ళయితే యేం?

సుద: నీవుకూడా వాళ్లల్లో వాడివే?

కేశవ: నాకూ వాళ్ళకూ భేదం ఒకటే ఉంది. నాకు దేవుడున్నాడు. వాళ్ళకు లేదు. అంతే!

# అంతా నాటకమే

## అంకము 4

(పోలీసుస్టేషన్—ఇన్‌స్పెక్టరు, కేశవదాసు)

కేశవ: (నిలుచుండి) ఎందుకండి నన్ను పిలిపించారు ?

ఇన్‌స్పె: (ఇతనివంక చూడకుండ ప్రక్కనున్న కానిస్టేబుల్‌తో) ఏమోయి అప్పలస్వామి కనిపించలేదా !

కానిస్టే: ఊళ్లో లేడండి, రేపు వస్తాడట.

ఇన్‌స్పె: నీపేరేమిటి?

కేశవ: కేశవదాసు.

ఇన్‌స్పె: నీకు తలపొగరు చాలాఉందటే.

కేశవ: అంత అమర్యాదగా మాట్లాడాలాఅండి. నా వల్ల దోష మేమిటో చెప్పండి.

ఇన్‌స్పె: నోరుముయ్యి. అప్పలస్వామీ నువ్వూ కలసి సురదర్శనంగారినికొట్టారటకదా !

కేశవ: నేనా! సుదర్శనంగారిని కొట్టటమా ! సుదర్శనంగారి కుమారుణ్ణి, కుమార్తెను అడగండి వాళ్లు నేనిట్లాంటిపని చేస్తానంటే ఒప్పుకుంటాను.

ఇన్‌స్పె: ఇంకాలో ఆయనకొడుకూ కూతురు ఎందుకు? నీవు వాళ్ళిద్దరినీ పాడుచేస్తున్నావట.

కేశవ: అల్లా అనుకొని సుదర్శనంగారు నామీద ఇల్లాంటిరిపోర్టు ఇచ్చారా అండి. సుదర్శనంగారి హోటలులో

రంగడని ఒకడున్నాడు. వాడిచేత నన్ను హోటలుగదిలో పెట్టి కొట్టించారు.

ఇన్స్పె: ఆట్టేవాగకు. నీవు ఎవరినిగురించి మాట్లాడుతున్నావో తెలుసునా!

కేశవ: చిత్రం. మనదేశంలో ఉన్న పెద్ద బ్లాకుమార్కెటీరును గురించిమాట్లాడుతున్నానండి. పోలీసులను వలలోవేసికొని పేదవాళ్ళమీద అనేక ఘోరాలు చేస్తున్న ఒక దుర్మార్గుణ్ణి గురించి మాట్లాడుతున్నానండి.

ఇన్స్పె: నీ పొగరు దించుతాను. కపడ్దార్ - ఒళ్ళు పై తెలియకుండా మాట్లాడుతున్నావు. ఏయ్, ఇతన్ని లాకప్‌లో పెట్టు.

కేశవ: మీరు నన్ను లాకప్‌లో పెట్టవచ్చు. కాని సుదర్శనంగారిని మీరు రక్షించలేరండి. మినిస్టరు ఫర్ ఇంటర్నల్ ఎఫైర్సుతో నేను సుదర్శనంగారి వ్యవహారమంతా రిపోర్టు చేశానండి. అనేక రికార్డులతో సహా. ఆయనా నేనూకలిసి చిన్నప్పుడాడుకున్నాము—నాకూ ఆయనకూ చాలాచాలా దోస్తీ. నేను ఈసంగతికూడా తరవాత వారితో చెప్తుంటానండి. సుదర్శనంగారిమీద కేసు ఇన్వెస్టిగేషన్‌లో ఉంది. అది ఇంతటితో తేలిపోయేదికాదు.

ఇన్స్పె: సరేలే నీవింక పిచ్చివేషాలు వెయ్యకు. వెళ్ళిపో, మళ్ళీ నీమీద రిపోర్టువస్తే జాగ్రత్త.

కేశవ: వస్తే యీసారి నామీద కాదండి.

ఇన్స్పె: చాలులే! యింకవెళ్ళు.

ఆనం: (ప్రవేశించి) ఏమండీ! యిన్స్పెక్టరుగారూ! మా నాయనగారిచ్చిన దొంగ రిపోర్టు మీద ఆధారపడి కేశవ దాసుగారిని అరెస్టు చేస్తారా!

కేశవ: అరెస్టు చెయ్యలేదయ్యా! ఊరికే స్టేషనుకు పిలిపించారు. ఇప్పుడే యింటికి వెళ్లిపొమ్మన్నారు.

ఆనం: అప్పలస్వామి రంగడిని కొట్టాడు. నాన్నగారి జోలికి పోందే!

కేశవ: రంగడికీ మీ నాన్నగారికీ ఒకటే దేహం. నాణ్ణి కొడితే మీ నాన్నగారిని కొట్టినట్టే.

ఆనం: రంగడిచేత మిమ్మల్ని కొట్టించట మేమిటైంది?

కేశవ: నేను రిపోర్టు చేయలేదు గదయ్యా! రిపోర్టు చేయకపోతే పోలీసువారు కేసు పట్టుకోరు. వాళ్లు చూస్తూ ఉండగానే ఒక అన్యాయం జరుగుతుంది. వాళ్ళు దాన్ని చూడరు. ఇంకోరు వచ్చి దాన్ని రిపోర్టు చెయ్యాలి. ఇది యింగ్లీషు లా.

ఇన్స్పె: మీరు వెళ్లండి. స్టేషన్‌లో అల్లరి చేయవద్దు.

రంగమ్మ: (ప్రవేశించి) ఆనందరావుగారూ, మా వారిని పోలీసులు (అర్ధోక్తిలో) మిమ్మల్ని జైలులో పెట్టలేదా!

కేశవ: మీ ఆనందరావు వచ్చి వదిలించాడు.

రంగమ్మ: మా ఆనందరావా!

కేశవ: అవును, నీవు ఆనందరావుతో లేచిపోతావు కదూ. నాగతి యేమి చేశావు?

ఆనంద: నీకు పాతిక వేల రూపాయిలు ఇచ్చాను. నీ పేర బ్యాంకులో వేశాను.

కేశవ: మరింకా బిల్లు ప్యాసు కాలేదుగా! నేను కేసు పెడితే కోర్టువారు నా భార్యను నా కిచ్చివేస్తారు.

రంగమ్మ: ప్రేమలేని భార్య ఉండి యేం చేస్తుంది.

కేశవ: ఆ ప్రేమలేని భార్య భర్తని పోలీసులు జైలులో పెట్టారని యెందుకు వచ్చింది?

ఆనంద: జాలిచేత వచ్చింది.

కేశవ: నాకీ సంగతి తెలుసు. అందుచేత నన్ను ప్రేమించే వాళ్ళను వేరే యిదివరకే చూచుకున్నాను.

ఆనంద: ఎవరు వారు?

రంగమ్మ: ఎవరేమిటి ఆవిడ?

కేశవ: మీ దయవల్ల నే నిప్పుడు దరిద్రుణ్ణి కానుగదా! పాతిక వేలతో కోతుల నాడించవచ్చు. ఇన్స్పెక్టరు గారూ! నా దగ్గిర ఇప్పుడు పాతిక వేలున్నాయి. మీవంటి వాళ్లు నన్నొక కంట కనిపెట్టిచూస్తూఉంటే బ్లాకు మార్కెటింగుచేసి దీన్నే ఒక లక్ష చేస్తాను.

ఇన్స్పె: నీవు బలే అసాధ్యుడవయ్యా!

కేశవ: నేనే మసాధ్యుడనండీ! నాభార్యను పోగొట్టుకున్నాను.

రంగమ్మ: మరింకెవరినో సంపాదించా నంటిరి గదా!

కేశవ: మునుపటి రోజులలో అయితే ఆవిడా ఒక యాభై వేలు తెచ్చేదే! ఇప్పుడొక పాతిక వేలన్నా లేదా అని. వాళ్ళ నాన్నమీద బ్లాకు మార్కెటింగు కేసు

లున్నయి. ఒక య్యాభై వేలయినా వదులుతయి. అందు చేతనూ ఇంకొొక కారణం చేతనూ ఏమీా యివ్వడు.

రంగమ్మ: ఇంకో కారణం ఏమిటి ?

కేశవ: మా యిద్దరిదీ వర్ణాంతర వివాహం. మీా యిద్దరికి మల్లేనే. ఆయన మగవాడు గనుక సరిపోయింది. మా యిద్దరిలో నేను మగవాడను.

ఆనంద: ఎవరావిడ ?

కేశవ: నన్ను ఖైదులో పెట్టారని ఆవిడకింకా తెలిసిఉండదు. లేకపోతే యీపాటికి వచ్చేదే. పైగా ఆవిడ ధనవంతుల యింటిబిడ్డ. ఊరికే యీావిడను మల్లే బజారున పడి వస్తుందా ? రాదు.

రంగడు: (ప్రవేశించి) ఇన్‌స్పెక్టరుగా రున్నారా అండి !

( కేశవదాసు వంక కోపంగా చూస్తాడు. )

కేశవ: రంగడూ ! నేను సుదర్శనంగారిని కొట్టానా !

రంగడు: నాకు తెలియదు.

కేశవ: అప్పలసామి సుదర్శనంగారిని కొట్టాడా !

రంగడు: లంజకొడుకు ! నేనేంటి ! అయ్యగారి మీాది కెళితే సచ్చాడన్న మాటే ! డొక్క-చించి డోలు కడతాను.

కేశవ: ఆహా! నేనూ అప్పలసామీా కలసి అయ్యగార్ని కొట్టా మటగా ?

రంగడు: నన్నుకొడితే ఊరుకున్నాగాని అయ్యగారి మీాది కెళితేనా ప్రాణం పోయినాసరే లంజకొడుకుని సంపేశే వాణ్ణే కాదూ ?

ఆనం: ఇఁ స్పెక్టరుగా రెందుకురా !

రంగడు: బాబు యిక్కడే ఉన్నాడే. సిన్నమ్మగారు తీసుకు రమ్మన్నది.

ఇఁ స్పె: సిన్నమ్మ యెవరురా !

రంగడు: బాబు సెల్లెలుగా రండి. అయ్యగారి కూతురు.

ఇఁ స్పె: ఎందుకు !

రంగడు: నాకు తెల్దు బాబూ ! ఒక్కసారి రమ్మన్నారు. మీరు రాకపోతే అరే ఒత్తామన్నారు.

ఆనం: మా శకుంతలండీ. ఎందుకో ఒక్కసారి వెళ్ళిరండి. నాన్నగారు ఊళ్ళోలేరు. మద్రాసు వెళ్లారు.

రంగడు: అయ్యగా రొచ్చారండి. ఇంతకు ముందే వచ్చారు.

శకుం: (ప్రవేశించి) నేనే వచ్చాను. నాన్నగారు వచ్చారు. ఆయనకి తెలిస్తే నన్ను రానిచ్చేవారు కారు. ఇదుగో అందరూ ఇక్కడే ఉన్నారే (కేశవదాసు దగ్గరకు వెళ్లి) మిమ్మల్ని జైలులో పెట్టలేదన్నమాట.

కేశవ: నువ్వు కబురు పంపించావు. అందుచేత వదిలిపెట్టారు

శకుం: ఈవిడ ఎవరు !

కేశవ: మీ అన్నగారి భార్య.

శకుం: మా అన్న భార్యేమిటి ? మా వదినె యింట్లోనే ఉందిగా !

కేశవ: ఈవిడ యింకొకతె. పాతికవేలుపెట్టి కొన్నాడు.

శకుం: మానాన్నగారికి తెలిస్తే చంపెయ్యడూ!

కేశవ: నీవు రేపెవరినన్నా ప్రేమించి వెళ్లిపోతేమాత్రం ఊరుకుంటాడా !

శకుం: నేను ప్రేమకోరకు వెళుతున్నాను.

కేశవ: మీ అన్నయ్య ఆవిణ్ణి ప్రేమించలేదంటావా!

శకుం: భార్య ఉండగా ఇంకొక త్తైను ఎల్లా ప్రేమిస్తాడు!

కేశవ: ఇద్దరు పెళ్లాలు పనికిరారంటావు. ఒక్కసారి ఒకట భార్యే ఉండాలి అన్నమాట. యూరపులో అంతే, క్రైస్తవ మత ప్రకారం. దీన్ని ముసల్మాను లొప్పుకోరు. పూర్వం మన వాళ్ళూ ఒప్పుకొనేవాళ్లు కారు.

ఆనం: మీరూ ఒప్పుకోరా!

కేశవ: నేనూ ఒప్పుకోను. నే నొప్పుకుంటే నాకు పాతిక వేలు ఎట్లా వస్తవి? పైగా స్త్రీ పురుషు లున్నారా! కోరికలూ, సుఖదుఃఖాలు అన్నీ ఒకటేగాని సంతాన విషయికంగా చూస్తే వాళ్ళకు భేదముంది. అందుచేత పురుషుడు ఇద్దరు భార్యలను చేసుకోవచ్చు. స్త్రీ చేసుకోరాదు.

రంగమ్మ: మీ మగవాళ్ల దగ్గ రున్నదిదే.

ఇన్స్పె: సనాతనిస్టు.

కేశవ: ఇది శాస్త్రవిషయం. సంఘు విషయం కాదు.

ఇన్స్పె: మీ శాస్త్రాలవల్ల నే యిల్లా వచ్చింది దేశానికి.

కేశవ: మా శాస్త్రాలు కావయ్యా! మీ శాస్త్రాలే. నా కింగ్లీషు రాదనుకో. ఇంగ్లీషు చదివినవాళ్ళ మాటలే. మేరీ స్టోప్సు అని ఒక ఆవిడ వ్రాసిందటగా. పురుషవీర్యం యొక్క శక్తిని గురించి. వంశపరంపర,— అంటే మీ భాషలో "హెరిడిటీ" అంటారుట,— దాన్ని రక్షించే దెవరు, స్త్రీ ఆ! పురుషుడా! కనుక స్త్రీ కిద్దరు పురుషులు పనికిరారు. పురుషుడికి పనికివస్తుంది.

రంగమ్మ: మీఅంత దేశం పాలించేవాళ్ళకు తెలియదు.

కేశవ: ఇప్పుడు దేశం తెలిసినవాళ్ళు పాలిస్తున్నారంటావా ? పలుకుబడీ, ఓట్లు, డబ్బు, పార్టీ. ఇవీ పాలించేది దేశాన్ని.

రంగమ్మ: వాళ్ళూ చదువుకున్నా రంటారా !

కేశవ: చదువంటే యేమిటి ? ఏచదువు? ఈ ప్రశ్నలు నీ కర్థంకావు. ఒక్కొక్క చదు వొక్కొక్క సంప్రదాయానికి చిహ్నం. సంప్రదాయమంటే మనదేశంలో మాటేకాదు. పాశ్చాత్యులకూ సంప్రదాయం ఉంది. ఆచదువు చదివితే ఆ భావాలే వస్తవి, చూడు. మనదేశంలో సంస్కృతం చదివినవాళ్లు మీ నాగరికత ఒప్పుకోరే. ఏ చదువు చదివితే ఆ భావాలే వస్తవి.

రంగమ్మ: ఇంతకూ మిమ్మల్ని ప్రేమించిన ఆవిడ యెవరు ?

శకుం: నేను.

ఆనం: నువ్వా !

సుదర్శనం: (ప్రవేశించి) ఆనందా! శకుంతలా! ఇక్కడికి వచ్చా రెందుకు? (కేశవదాసునుచూచి) బాబూ! ఇక్కడున్నావా! నీకు వెయ్యి దణ్ణాలు కాని మా పిల్లలజోలికి రాకు. నీవు నన్ను పాడుచేసింది చాలు. నీ మూలంగా యాభై వేలు వదిలినయి.

కేశవ: నీ పిల్లలే నన్ను పట్టుకున్నారు. నీ కొడుకు నా భార్యను లేవదీసుకు వెళతాడుట. నీ కూతురు విషయం నీవే అడుగు.

సుద: ఏమిటి శకుంతలా?

శకుం: నేను కేశవదాసుగారిని ప్రేమిస్తున్నాను.

ఆనం: (చెల్లెలితో) నీ కేమైనా బుద్ధి వుందా!

శకుం: ఏం! నీవాయన పెళ్లాన్ని ప్రేమించటం లేదా! అల్లాగే.

సుద: అమ్మా! అది మనకులానికి తగినదికాదు.

శకుం: ఇంకా కులాలేమిటి? ప్రేమే ప్రధానం. ప్రేమే దైవం.

కేశవ: అది ఇంగ్లీషువాళ్లమాట. ప్రేమ దైవంకాదు. ప్రేమ మనుష్యుల కుండే కామంలో భాగం. సంఘవిషయం మనప్రకారం ధర్మం. ధర్మము దైవస్వరూపం కాని ప్రేమ కాదు. ప్రేమ దైవమంటేనే సంఘమిల్లా అయింది. ఎవడి ధర్మం వాడు చేయడమైతే యిల్లా మునగదు.

ఆనం: మీరన్నమాట నిజమే. నేను మీభార్యను ప్రేమించటం అధర్మం. మీభార్య నాకు వద్దు.

కేశవ: మరి నీసాతిక వేలూ___

ఆనం: మీకిచ్చాను తీసుకోండి. అది నా అధర్మానికి శిక్ష.

సుద: నాకు యేభైవేలు శిక్ష యిదివరకే తగిలింది.

రంగ: మా ఆయన యిదివరకు డబ్బులేనివాడు గనుక నేనిదివరకు ప్రేమించలేదు. ఇప్పుడు నేను నాభర్తనే ప్రేమిస్తున్నాను.

కేశవ: మరి నిజానికి నిన్ను నేను వదలి వెయ్యాలి కాని నిన్ను నేను పెళ్ళి చేసుకొన్నాను. అందుచేత నాకు తప్పదు. అది నా ధర్మం.

శకుం: మరి నామాట యేమిటి? నాకిదివరకు పెళ్లి కాలేదు కనుక నాకల్లాంటి ధర్మంలేదు. నేను నిన్నే ప్రేమిస్తున్నాను.

కేశవ: నాయందు నీకు సంతానం కలిగితే వాళ్ళకు నా గుణాలు వస్తవి. అడుక్కు-తినేగుణాలు. నీ కులంవాణ్ణి చేసికొని వాణ్ణే ప్రేమిస్తే నీ కడుపున దేశాన్ని ఏలేవాళ్లు పుడతారు. యుద్ధం చేయగలవాళ్ళు పుడతారు! నా కులం వేరు. నీ కులం వేరు. మన యిద్దరికీ పుట్టే పిల్లలు నీ కులం గుణాలూ కాదు, నా కులం గుణాలూ కాదు, సంకర వెధవలు పుడతారు. కనుక నా మాట విను. ఇవ్వేళ ఒకరిని ప్రేమిస్తాము. కొన్నాళ్ళు ఇంకోరిని ప్రేమిస్తాము. ఈ ప్రేమ శాశ్వతంకాదు కనుక నే విడాకులు. ధర్మాన్ని అవలంబిస్తే సంఘం శాంతంగా ఉంటుంది.

శకుం: మీ యిష్టం. మీరు నన్ను ప్రేమించమంటే ప్రేమించాను. వద్దంటే మానివేస్తాను.

కేశవ: నీవు చిన్నపిల్లవు. నేను పెద్దవాణ్ణి.

శకుం: ప్రేమకు చిన్నా పెద్దా యేమిటి ?

కేశవ: ప్రేమకు లేదుగాని పెళ్లికివుంది. ఇప్పుడు మన సంఘం అల్లాగే ఉందిగా ? ఒకవేపున ప్రేమ ప్రేమ అంటారు. ఇంకోవేపున పెద్దవాళ్లు చిన్నపిల్లలను చేసుకోరాదంటారు. మళ్లీ ఒక పురుషుడు ఇద్దరు స్త్రీలను చేసుకోరాదు. ఇద్దరి మీదా ప్రేమ ఉంటే, ఇద్దరూ అతణ్ణే ప్రేమిస్తే. కనుక ప్రేమకాదు ప్రధానం.

సుద: దాసుగారూ. నన్ను క్షమించండి. రంగడిచేత మిమ్మల్ని కొట్టించాను.

కేశవ: పోలీసు స్టేషనులో ఇన్‌స్పెక్టరుగారి యెదట నేనా అలా చెప్పటం. పాపం నన్ను కొట్టారేమో దెబ్బయిబయిదు వేలు నష్టపడ్డారేమో!

సుద: పోతే పోయిందిలే నాయనా! నా కూతుర్ని వదలి పెట్టావు.

కేశవ: నీ కూతురు నా కెందుకయ్యా! మా రంగమ్మ ఉండగా. ఇప్పుడు నా దగ్గర పాతిక వేలున్నవి. ఇంక నన్ను వదిలి పెట్టి పోదు.

రంగ: బాగుంది.

రాము: (ప్రవేశించి) వదినే! పొయ్యిమీద అన్నం పెట్టివచ్చావు. అన్నంకూడా చిమిడిపోయింది.

రంగ: అన్నంవండే బాధ పోయిందనుకున్నాను. పద మళ్ళీ మీకు ఉడక వేసి పెట్టేగతి నాకు తప్పలేదు.

రంగడు: ఇదంతా నాటకంగాఉందే!

(అందరూ వెళతారు.)

సమాప్తం.



28-8-54



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPLA 10113, 141 |
| పుస్తకం పేరు | ఆంధ్ర నాటకవేదిక |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, 88 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |